శ్రీరస్తు.

# శ్రీమహాభాగవతప్రశ్నోత్తరములు


గ్రంథకర్త:

శ్రీమల్లవరపు సుబ్బయ్యశర్మగారు,

గొల్లకందుకూరు, సంగంపోస్టు, నెల్లూరుజిల్లా.





చెన్నపురి:

'వావిళ్ల' ప్రెస్సున

ముద్రితము.

1955

# విజ్ఞాపనము

ఆర్యులారా!

వేదములు కల్పవృక్షముగాను, ఆకల్పవృక్షమునకు శ్రీ భాగవతము ఫలముగాను పెద్దలభివర్ణించియున్నారు. అనగా యీభాగవతపురాణము వేదసారమని అర్థము. ఆసన్నమరణులైన పరీక్షన్మహారాజునకు, అత్యంత నిస్పృహుఁడై, పంచభూతమయుఁడై, అయోనిసంభవుఁడైన శ్రీశుకమహర్షి చెప్పుటచేతనే దీని ప్రాశస్త్యము జగత్ప్రఖ్యాతముగా విదితమగుచున్నది.—

ఇందు సంపూర్ణమైన భక్తితత్వము ప్రతిపాదించబడియున్నది. మానవులకు కర్తవ్యములైన సకలధర్మము లుపదేశింపబడియున్నవి. ఇట్టి గ్రంథమునుఁజదివి యిందులోని అర్థములను పితాపుత్రసంభాషణగా శ్రీపురుషసూక్తము, విష్ణుసహస్రనామమువలె ప్రశ్నోత్తరరూపముగానుండిన బాగుండునని సుగమముగావించి యున్నాడను. భాగవతమాద్యంతము చదువలేని బాలవృద్ధాదుల కిది సహకారియగునని నా యత్యల్పబుద్ధికి తోచినది. గాన పెద్దలిందలి గుణదోషములను బరిశీలించి గుణములను గ్రహించెదరని మఱియు, మఱియు విజ్ఞాపనముజేయు

మహాజన పాదపాంసువు

మల్లవరపు సుబ్బశాస్త్రి.
గొల్లకందుకూ

శ్రీ గురుభ్యోనమః
శ్రీ మహాగణాధిపతయే నమః
శ్రీ రాధాకృష్ణ పర బ్రహ్మణే నమః

# శ్రీ మహాభాగవత ప్రశ్నోత్తరములు

## మంగళము

శ్రీ కైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళా సంరంభకున్ దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా
నాకంజాతభవాండ కుంభకు మహానందాంగనా డింభకున్

— కృతిపక్త ఇష్టదేవతాస్తుతి —

ఉ. వాలిసిభక్తి మ్రొక్కెద నవారితతాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజా ముఖపద్మ మయూఖమాలికిన్
బాలశశాంకమౌళికిఁ గపాలికి మన్మథగర్వపర్వతో
న్మూలికి నారదాదిముని ముఖ్యమనస్సరసీరుహాళికిన్. ప్ర. 2

ఉ. అమ్మల గన్నయమ్మ ముగురమ్ములమూలపుటమ్మ చాలఁబె
ద్దమ్మ సురారులమ్మ కడుపాఱడిపుచ్చినయమ్మ తన్నులో
నమ్మిన వేల్పుటమ్మలమనమ్ములనుండెడియమ్మదుర్గమా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వకవిత్వపటుత్వసంపదన్.
ప్ర. 8

---

# శ్రీ వేదవ్యాసమహర్షి స్తవము

చ. పరమసమాధిధుర్యుఁ బటుపావన కర్మవిధేయు దేవతా
వరనరవంద్యు సద్విమలవాక్యు జనార్దనకీర్తనక్రియా
భరణసమృద్ధవేద చయపారగు భవ్యుఁ ద్రికాలవేదిఁగా
సురమతిఁ గొల్చుటొప్పు బుధశోభితుఁ బుణ్యుఁ బరాశరాత్మ
జున్.

క. వ్యాసుఁడు భగవత్పరసం
వాసుం డాగమపురాణవరవిష్ణుకథా
వాసుఁడు నిర్మలకవితా
భ్యాసునిపద పద్మయుగము భావింతుమదిన్.

క. నారాయణునకు నరునకు
భారతికిని మ్రొక్కి వ్యాసుపదములకు నమ
స్కారము సేసి పఠింతును
దార గ్రంథంబు దళితతనుబంధంబున్.

# శ్రీశుకమహర్షిస్తవము

సీ. ప్రతినిమేషముఁ బరబ్రహ్మంబు నీక్షించి
మఱిఁ జొక్కి వెలుపల మఱచువాఁడు
కమలంబుమీఁది భృంగములకై వడి మోము
పై నెఱసిన కేశపటలివాఁడు
గెఱవ్రాసి మాయనంగీకరించిన భంగి
వసనంబుఁ గట్టక వచ్చువాఁడు
సంగి గాఁ డని వెంటఁ జాటుభూతములు నా
బాలుక హాసశబ్దములవాఁడు
తే. మహితపదజాను జంఘోరు మధ్యహస్త
బాహువక్షోగళాననఫాలకర్ణ
నాసికాగండమస్తక నయనయుగళుఁ
డైన యవధూతమూర్తివాఁ డరుగుదెంచె. ప్ర. 516

ఉ. ఈసని లోకులం గినిసి యెగ్గులు పల్కనివాఁడు గోరికల్
రనివాఁడు గూటువలఁ గూడనివాఁడు వృథాప్రపంచముం
నివాఁడు దైవగతిఁ జేరిన లాభముఁ జూచి తుష్టుఁడై
నే వానిచందమున నేర్పులు సూపనివాఁడు వెండియున్.
ప్ర. 517

గీ. వెఱ్ఱితన మానివిజ్ఞానమూర్తియై
బ్రహ్మభా మునను బర్యటింప

వెఱ్ఱియంచు శుకునివెంట నేతెంతురు
వెలఁదు లర్భకులును వెఱ్ఱులగుచు. ప్ర. 519

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటి
వో, వమహాప్రీతి నొహోకుమారయనుచున్ వ్యాసుండు
చీరంగ వృ, క్షములుం దన్మయతంబ్రతిధ్వనులు చక్కంజేసె
మున్నట్టిభూ, తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపో
ధన్యాగ్రణిన్ ధీమణిన్. ప్ర. 55

సీ. కామ్యవర్గంబును గారణసంఘంబు
నధికరించి చరించు నాత్మతత్త్వ
మధ్యాత్మమనఁబడు నట్టియధ్యాత్మముఁ
దెలియజేయఁగఁ జాలుదీపమగుచు
సకలవేదములకు సారాంశమై యేక
మై యసాధారణమగు ప్రభావ
రాజకంబైన పురాణమర్మంబును
గాఢసంసారాంధకారపటలి

తే. దాఁటఁ గోరెడివారికి దయ దలిర్ప
నేతపోనిధి విపరించె నేర్పడంగ
నట్టిశుకనామధేయు మహాత్మగేయు
విమల విజ్ఞానరమణీయుఁ వేడ్కఁ గొలుతు.

క. సకలాగమార్థపారగుఁ
డకలంకగుణాభిరాముఁ డంచిత బృందా
రకవంద్యపాదయుగుఁ డగుఁ
శుకయోగికివందనంబు సొరదియొనర్తున్.

ప్ర—శ్రీశుకమహర్షి మహాత్మ్యమేమి ?

ఉ—తరళము.

శుకుఁడు గోఁచియులేక పైఁజనఁజూచి తోయములందుఁబాల
జనుఁ జలించక చీరలొల్లక చల్లులాడెడి దేవక
న్యకలు హా శుకయంచు వెన్కఁజనంగ వ్యాసునిఁజూచియం
శుకముల్ ధరియించి సిగ్గున స్రుక్కి రంభలు ధీనిధీ. ప్ర. 77

వ. మఱియునగ్నుండును దరుణుండునై చనుకొడుకుం గని వస్త్ర పరిధానంబొనరింపక వస్త్రధారియు వృద్ధుండునునైన తనుం జూచి చేలంబులు ధరియించు దేవరమణులం గని వ్యాసుండు కారణంబడిగిన వారలు నీపుత్రుండు, స్త్రీపురుషులనెడి భేద దృష్టిలేకయుండు మఱియునతండు నిర్వికల్పుండుగాన నీకు నతనికి మహాదరంబుగలదని పట్టి శుకుండు కురుజాంగలదేశం బులుసొచ్చి హస్తినాపురంబునఁ బౌరజనంబులచే నెట్టు జ్ఞాతుం డయ్యె మఱియు నున్మత్తునిక్రియ మూఁగతెఱంగున జడుని భంగినుండెను. ప్ర. 78

ప్ర—శ్రీశుకమహర్షి గృహస్థునిగృహమున నెంతకాలముండును?
ఉ—గోవుబితికినంతతడవుండును. ప్ర. 78

శ్లో॥ గోదోహనమాత్రంవా గృహేషుగృహమేధినామ్.
ప్ర. 4 అధ్యాయ. 7 శ్లో.

ప్ర—రు సంచరించిన ప్రదేశములెట్టివి ?

ఉ—అనుగోదోహన మాత్రకాలంబు సంచరించిన స్థలం బులు తీర్థంబులగుచుండు. ప్ర. 78

శ్లో. అవేక్షితేమహాభాగ స్త్రీథకుర్వం స్తదాశ్రమమ్.
ప్ర. 4 అను 8 శ్లో

ప్ర.—శ్రీవారు పరీక్షిత్తుసన్నిధికి విజయముచేసి యెన్నిదినము లుండిరి ?

ఉ.—ఏడుదినములుండిరి. ప్ర. 77

ప్ర.—అప్రార్థనీయముగా విజయముచేసిన నయ్యోగిశిఖామణితో పరీక్షిన్నరేంద్రు డేమనివిజ్ఞాపనముజేసెను ?

ఉ.—సీ. ... ... ... ...

గీ. నావుఁబితికినతడవెంత యంతసేపు
గాని యొకచోటనుండవు కరుణతోడఁ
జెప్పవే తండ్రిముక్తికిఁ జేరుతెరువు. ప్ర. 525

ప్ర.—అందులకు వారేమని సెలవిచ్చిరి?

ఉ.—సీ. ద్వైపాయనుఁడు నాదుతండ్రి ద్వాపరవేళ
బ్రహ్మసమ్మితమైన భాగవతముఁ
బఠనంబు సేయించె బ్రహ్మతత్పరుఁడనై
యుత్తమ శ్లోకలీలోత్సవమున
నాకృష్టచిత్తుండనై పఠించితి నీవు
హరిపాదభక్తుండవగుట జేసి
యెఱిఁగింతు వినవయ్య యీభాగవతమున
విష్ణు సేవాబుద్ధి విస్తరిల్లు

తే. మోక్షకామునకునుమోక్షంబు సిద్ధించు
భవభయంబు లెల్లఁ బాసిపోవు

యోగి పుంగవునకు నుత్తమ వ్రతములు
వాసుదేవు నామ వర్ణనములు. ద్వి. 7

ప్ర:—మఱియు నేమని సెలవిచ్చిరి.

ఉ:—తరలము.—

హరి నెఱుంగక యింటిలో బహుఃహాయనంబులు మత్తుడై
పొరలుచుండెడి వెఱ్ఱిముక్తికిఁ బోవనేర్చునె వాఁడు సం
స్మరణముం బెడఁబాయఁ డెన్నడు సత్యమా హరినామ సం
స్మరణ మొక్కముహూర్తమాత్రము చాలుముక్తివమా
నృపా. ద్వి. 8

ప్ర.—శ్రీపరీక్షిత్తు సన్నిధికి శ్రీమహర్షి విజయము జేయు
నప్పటికి శ్రీమహర్షి వయస్సెంత.

ఉ.—ఆ. అమ్మహాత్ము షోడశాబ్ద వయోరూప
గమనగుణవిలాస కౌశలములు
ముక్తికాంత సూచి మోహిత యగు నన
నితరకాంతలెల్ల నేమి జెప్ప. ప్ర. 518

ప్ర.—శ్రీపరీక్షుతు గర్భస్థుడుగా నుండి భగవంతునేమని ప్రార్థిం
చెను.

ఉ.—వ. అభిమన్యుకాంతా గర్భంబునవున్న డింభకుడు దశమాస
పరిచ్ఛేద్యుడై గర్భాంతరాళంబున దురంతంబైన యశ్వ
త్థామబాణానలంబున దందహ్యమానుండై తల్లడిల్లుచు.
ప్ర. 79

ఉ. కుయ్యిడ శక్తిలే దుదరగోళములోపలనున్న వాఁడ ది
క్కెయ్యది దా ననాథనని యెప్పుడుఁ దల్లి గణింప విందునే

డియ్యెషు వహ్ని వాయుటకు నెయ్యదిమార్గమునన్నుఁ గావనే
యయ్యగలండు గర్భజనితాపద నెవ్వఁడెఱుంగు దైవమా.
ప్ర. 230

క. చిచ్చర కోలవశంబునఁ
జచ్చి బహిర్గతుఁడగాని సమయమునను వా
నుచ్చలిత గర్భవేదనఁ
జచ్చును మాతల్లిగర్భ సంతాపమునన్. ప్ర. 231

ప్ర—తల్లి గర్భంబున పరమేశ్వరుండు ప్రవేశించి ఏమిచేసెను.

ఉ—వ. ......డింభకుని పరితాప విజృంభణంబు నివారించి
గర్భంబు గందకుండ నర్భకునికి నానందంబుఁ గల్పించెను.
ప్ర. 286

మ. గదఁ జేఁబట్టి పరిభ్రమించుచు గదా
ఘాతంబులం గ్రూర శు
క్రప్రదమై వచ్చుశరాగ్నిఁ దుత్తుమురుగా
భంజించిరక్షించె నీ
సమయం బెవ్వఁడొకో యటంచు మదిలో
జర్చించుచున్ శాబకుం
డెదురై చూడ నదృశ్యుఁడయ్యెహరి స
ర్వేశుండు విప్రోత్తమా. ప్ర. 237

ప్ర—పరీక్షితునకు విష్ణురాతుఁడను పేరెందుకు వచ్చెను.

ఉ—చ. ప్రకటిత దైవయోగమునఁ గౌరవ సంతతి యంతరిం
పఁగా, వికలత నొందనీక ప్రభవిష్ణుఁడు విష్ణుఁడను గ్ర
హించినా, బకు బ్రతికించెఁ గావున నృపాలకశాబకుఁ

డింకశాత్రవాంతకుఁడగు విష్ణురాతుడనధాత్రి బ్రసిద్ధికి
నెక్కుఁ బూజ్యుఁడై. ప్ర. 289

ప్ర.—ఈయన జాతకప్రభావము బ్రాహ్మణులేమని జెప్పిరి.

ఉ.—వ. పెక్కేండ్లు జీవించి భూసురకుమార ప్రేరితంబయినతక్షక
సర్పవిషానలంబున దనకుమరణం బని యెఱింగి సంగ
వర్జితుండయి ముకుంద పదారవింద భజనంబునే
యుచు శుకయోగీంద్రునివలన నాత్మవిజ్ఞాన సంపన్నుడై
గంగాతటంబున శరీరంబు విడిచి నిర్గత భయశోకం
బయిన లోకంబు ప్రవేశించునని జాతకఫలంబు భూసు
రులు చెప్పిరి. ప్ర. 295

ప్ర.—పరీక్షిత్తుగంగా తీరమున ప్రాయోపవేశము చేయునప్పు
డెట్లుండెను.

ఉ.—క. చిత్తము గోవింద పదా
యత్తముగావించి మౌనియై తనలోనే
తత్త్వరము లేక భూవర
సత్తముఁడు వసించె ముక్తసంగత్వమునన్. ప్ర. 497

ప్ర.—అపుడు పరీక్షిత్తు సన్నిధికి వచ్చిన వారెవరు.

ఉ.—వ. ప్రభువు ప్రాయోపవేశమువిని సకలలోకపావనమూర్తులు
మహానుభావులునగుచు దీర్ఘంబులకు దీర్ఘత్వంబులొసంగ
సమర్థులైన అత్రి. విశ్వామిత్ర. మైత్రేయభృగు. వసిష్ఠ. పరా
శర. చ్యవన. భరద్వాజ. పరశురామ. దేవల. గౌతమ. కశ్యప.
కవష. కణ్వ. కలశసంభవ. వ్యాస. పర్వత. నారద ప్రముఖు
లైన బ్రహ్మర్షి. దేవర్షి. రాజర్షి. పుంగవులును. గాండర్షుల

యిన అరుణాదులును. నానాగోత్రసంజాతులైన మునులును శిష్య ప్రశిష్యసమేతులయి చనుదెంచిన వారలకు దండప్రణామంబులాచరించి కూర్చుండ నియోగించెను. ప్ర. 498

ప్ర—అటుల విచ్చేసినమహానుభావులతో పరీక్షిత్తు ఏమని విజ్ఞాపనముచేసెను.

ఉ—క. ఏడుదినంబుల ముక్తిం
గూడఁగ నేరీతి నేర్చుగురుసంసార
క్రీడన మేక్రియనెడలెగుఁ
జూడుఁడు మాతండ్రు లారశ్రుతివచనములన్. ప్ర.513

శా. ప్రాప్తానందులు బ్రహ్మబోధన కళాపారీణులాత్మప్రభా
లుప్తాజ్ఞానులు మీరలార్యులు దయాశుద్ధాభిరాముల్ మనో
గుప్తంబుల్ సకలార్థజాలములు మీకుంగాన వచ్చుంగదా
సప్తాహంబులముక్తికేఁగెడుగతిం జర్చించి భాషింపరే.

ప్ర. 514.

ప్ర—దానికి మహర్షులేమని ప్రత్యుత్తరంబొసంగిరి?

ఉ—ఆవచనంబులకు మునులందరు ప్రత్యుత్తరంబు విమర్శించు నెడ దైవయోగంబున శ్రీశుకమహర్షి అచ్చటి కరుదెంచిరి.

ప్ర.—శ్రీభాగవత కృతివక్త శ్రీబమ్మెరపోతనామాత్యుని స్తుతి.

ఉ.—ఉ. ఎమ్మెలు సెప్పనేల జగమెన్నఁగఁబన్నగరాజశాయికిన్
సొమ్ముగవాక్యసంపదలు సూఱలుసేసినవాని భక్తితో
నమ్మినవాని భాగవతనైష్ఠికుఁడై తగువానిఁబ్రేమతో
బమ్మెరపోతరాజుఁగవిపట్టపురాజు దలంచి మ్రొక్కెదన్.

ష. 12

ప్ర—బాలురను శిక్షించుట మేలు.

ఉ.—క. లాలనమున బహుదోషము
లోలిం బ్రాపించు తాడనోపాయములన్
మేలిగుణంబులువచ్చును
బాలురకును తాడనంబుపథ్యంబరయన్. ద. పూ.

ప్ర—సాధురక్షణ దుష్టశిక్షణ ఎట్టిది?

ఉ.—క. రక్షణము లేక సాధువు
రక్షితుఁడగు సమతఁజేసిరాయిడులందున్
రక్షణముచేయగలిగిన
శిక్షితుఁడగుఖలుఁడు పాపచిత్తుండగుటన్. ద. పూ. 277

ప్ర—శ్రీభాగవతమని పేరువచ్చుటకు కారణమేమి?

ఉ.—సీ. విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వని
వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనమునఁ గార్యములందభిజ్ఞుఁడై
దానరాజగుచుఁ జిత్తమునఁ జేసి
వేదంబులజునకు విదితముల్ గావించె
నెవ్వఁడు బుధులు మోహింతురెవ్వ
నికి నెండమావులనీళ్లఁగాచాదుల
నన్యోన్యబుద్ధి దానదరునట్లు
గీ. త్రిగుణసృష్టియెందు దీపించి సత్యము
భంగిఁదోఁచు స్వప్రభానిరస్త,
కుహకుఁడెవ్వఁడతని గోరిచింతించెద
ననఘు సత్యుబరుని ననుదినంబు. స్క. 34

వ. ఇట్లు "సత్యం పరంధీమహి" యను గాయత్రీ ప్రారంభంబున గాయత్రీనామ బ్రహ్మస్వరూపంబై మత్స్యపురాణంబులోన (బురాణప్రస్థానంబున) గాయత్రి నధికరించి ధర్మ విస్తరం బును వృత్రాసురవధంబునెందేని జెప్పంబడునదియ భాగవ తంబని పలుకుటం జేసి యీపురాణంబు శ్రీమహాభాగవతంబన నొప్పుచుండు. ప్ర. 35

ప్ర—భాగవతమాహాత్మ్యమేమి ?

ఉ.—గీ. అల్పతరమైనసుఖముల నందుచున్న
జనులదుఃఖంబు మాన్పంగఁజాలునట్టి
పుండరీకాక్షగుణకథా ప్రోతమైన
వితతనిగమార్థమగు భాగవతమునీకు. తృ. 264.

సీ. ఆమ్మహాభాగవతామ్నాయ మొకనాఁడు
గైకొని పాతాళ లోకమందు
నప్రతీకజ్ఞానియై వాసుదేవాఖ్య
బొలుచుసంకర్షణమూర్తిదివ్య
పురుషుండు దనుఁడానబుద్ధిలోఁజూచుచు
నలలితధ్యాన ముకుళితనేత్రు
డై సనందాభ్యుదయార్థంబు గరువిచ్చి
చూచినవారు సంస్తుతులొనర్ప
తే. నమరగంగావగాహనులై యహీంద్ర
కన్యలార్ద్ర జటాబంధకలితలగుచు
భర్తృవాంఛానుబుద్ధి నప్పరమ పురుషుఁ
గనియనే తెంచి దత్పాదకమలయుగము. తృ. 265.

శ్లో. సిన్ధూనాం యథా గంగా
దేవానామచ్యుతో యథా,
వైష్ణవానాం యథా శంభుః
పురాణానామిదం తథా. ఏ. 15. శ్లో.

గీ. పుష్కరంబందు ద్వారకాపురమునందు
మధురయందును కలిసినమందు నెవడు
పఠనసేయుచు రమణరో భాగవతము
వాడు దరియించు సంసారవార్ధి నెపుడు.

ప్ర.—భాగవతము దేనికి పోల్చబడినది.

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మంజులతా శోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరోజ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై, వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్విజ శ్రేయమై. ప్ర. 22

ప్ర.—ఈ భాగవతము వేనివలె తేజరిల్లుచున్నది?

ఉ.—భూతంబులయందు నాధారభూతంబును, 2. సూక్ష్మంబుల యందు జీవుండును, 3. దుర్జయంబులయందు మనంబును, 4. దేవతలయందు బ్రహ్మగర్భుండును, 5. వసువులయందు హవ్యవాహనుండును, 6. నాదిత్యులయందు విష్ణువును, 7. రుద్రులందు నీలలోహితుండును, 8. బ్రహ్మలందు భృగుండును, 9. ఋషులందు నారదుండును, 10. ధేనువులందు కామధేనువును, 11. సిద్ధులందు కపిలుండును, 12. దైత్యుల యందు ప్రహ్లాదుండును, 13. గ్రహంబులందు కళానిధియు

14. గజంబులయందైరావతంబును, 15. హయంబులయందు ఉచ్చైశ్శ్రవంబును, 16.నాగంబులయందు వాసుకియు, 17.మృగంబులందు కేసరియు, 18. నాశ్రమంబులందు గృహస్థాశ్రమంబును, 19. వర్ణంబులయందోంకారంబును, 20. నదులందు గంగయు, 21. సాగరంబులయందు దుగ్ధసాగరంబును. 22. నాయుధంబులందు గాణ్డీకంబును, 23. గిరులందు మేరువును, 24. వృక్షంబులయందశ్వత్థంబును, 25. నోషధులందు యవలును, 26. యజ్ఞంబులందు బ్రహ్మయజ్ఞంబును, 27. వ్రతంబులయందహింసయు, 28. యోగంబులందాత్మయోగంబును. 29. స్త్రీలయందు శతరూపయు, 30. భాషణంబులయందు సత్యభాషణంబును, 31. ఋతువులందు వసంతాగమంబును. 32. మాసంబులలో మార్గశీర్షంబును, 33. నక్షత్రంబులలో నభిజిత్తును. 34. యుగంబులందు కృతయుగంబును, 35. భగవదవతారంబులలో వాసుదేవుండును, 36. యక్షులలో కుబేరుండును, 37. వానరులయం దాంజనేయుండును, 38. రత్నంబులందు బద్మరాగంబును, 39. దానంబులలో నన్నదానంబును, 40. తిథులయం దేకాదశియు, 41. నరులందు వైష్ణవుండై భాగవత ప్రవర్తనం బ్రవర్తించువాడును, 42. అష్టాదశపురాణంబులలో, భాగవతంబును దేజరిల్లు. ఏకా. 105

ప్ర—మతెచ్చట ఏమని చెప్పబడినది ?

ఉ—1. నదులందు భాగీరథివిధంబున, 2. దేవతలందు పద్మగర్భునిమాడ్కి, 3. దారకలందు గళానిధిగరిమ, 4. సాగరంబులందు దుగ్ధార్ణవంబు చందంబున, 5. నగంబులలో హేమ

నగంబుభాతి, 6. గ్రహంబుల విభావసుకరణి, 7. దైత్యులందు ప్రహ్లాదునిభంగి, 8. మణులయందు పద్మరాగంబురేఖ, 9. వృక్షంబులయందు హరిచందనంబు తరువురీతి, 10. ఋషులందు నారదుమాడ్కి, 11. ధేనువులందుఁ గామధేనువు పోల్కి, 12. సూక్ష్మంబులం జీవుని తెఱంగున, 13. దుర్జయంబులయందు మనంబువోల్పున, 14. వసువులందు హవ్యవాహనుపోడిమి, 15. నాదిత్యులందు విష్ణుప్రకరణి, 16. రుద్రులయందునీలలోహితునిరీతి, 17. బ్రహ్మయందు భృగువుసొబగున, 18. సిద్ధులందు కపిలునిలీల, 19. నశ్వంబులయందు నుచ్చైశ్రవంబులాగున, 20. సర్పకులంబులయందు వాసుకిరూపున, 21. మృగంబులయందు కేసరిచెలువున, 22. నాశ్రమంబులందు గృహస్థాశ్రమంబుక్రియ, 23. వర్ణంబులలో నోంకారంబు నిరవున, 24. నాయుధంబులఁ గార్ముకంబు సోయగంబున, 25. యజ్ఞంబులలో జపయజ్ఞంబుచాడ్పున, 26. వ్రతంబులం దహింసకరణి, 27. యోగంబులం దాత్మయోగంబు రమణ, 28. నోషధులయందు యవలసొబగున, 29. భాషణంబులయందు సత్యంబుతెర, 30. ఋతువులందు వసంతంబు ప్రోడి, 31. మాసంబులందు మార్గశీర్షంబు మహిమ, 32. యుగంబులందు కృతయుగంబునోజ నీభాగవతంబు తేజరిల్లు. ద్వా. 48

ప్ర.—భాగవతమును పఠించిన ఫలితమేమి ?

ఉ.—ఆ. అతిరహస్యమైన హరిజన్మ కథనంబు
మనుజుఁ డెవ్వఁడేని మాపురేపు,
చాలభక్తితోడఁ జదివిన సంసారఁ
దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు. ప్ర. 29

ప్ర—రసికజనాహ్వానము

ఉ—ఆ. వేదకల్పవృక్ష విగళితమై శుకు
ముఖ సుధాద్రవమున మొనసియున్న
భాగవత పురాణ. ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసికభావవిదులు. ప్ర. 35

ప్ర—శ్రీభాగవతము ద్వాదశస్కంధములకు ప్రతిస్కంధమునకు అధ్యాయములెన్ని శ్లోకసంఖ్యయెంత పద్యసంఖ్యయెంత?

| ఉ—స్కంధము. | అధ్యాయములు. | శ్లోకములు. | పద్యములు. |
|---|---|---|---|
| 1 ,, | 19 | 814 | 527 |
| 2 ,, | 10 | 396 | 288 |
| 3 ,, | 33 | 1388 | 1054 |
| 4 ,, | 31 | 1470 | 975 |
| 5 ,, | 26 | 645 | 167 |
| 6 ,, | 19 | 837 | 529 |
| 7 ,, | 15 | 735 | 481 |
| 8 ,, | 24 | 964 | 743 |
| 9 ,, | 24 | 975 | 735 |
| 10 పూర్వ | 50 | 2152 | 1789 |
| ఉత్తర | 90 | 1893 | 1341 |
| 11 ,, | 31 | 1362 | 126 |
| 12 ,, | 13 | 567 | 53 |
| | 385 | 14198 | 8808 |

ప్ర — వ్యాసభగవానులు వ్రాసినపురాణము లెవ్వి? వాని శ్లోకసంఖ్యయెంత?

| | | | శ్లోకసంఖ్య |
|---|---|---|---|
| 1 | బ్రాహ్మ్యపురాణము | ... | 10,000 |
| 2 | పాద్మ్యము | ... | 55,000 |
| 3 | విష్ణుపురాణము | ... | 23,000 |
| 4 | శైవము | ... | 24,000 |
| 5 | నారదము | ... | 25,000 |
| 6 | మార్కండేయము | ... | 9,000 |
| 7 | ఆగ్నేయము | ... | 15,400 |
| 8 | భవిష్యోత్తరము | ... | 14,500 |
| 9 | బ్రహ్మకైవర్తము | ... | 18,000 |
| 10 | లైంగము | ... | 11,000 |
| 11 | వారాహము | ... | 24,000 |
| 12 | స్కాందము | ... | 81,100 |
| 13 | వామనము | ... | 10,000 |
| 14 | కూర్మము | ... | 17,000 |
| 14 | మత్స్యపురాణము | ... | 14,000 |
| 16 | గరుడము | ... | 19,000 |
| 17 | బ్రహ్మాండము | ... | 12,000 |
| 18 | భాగవతము | ... | 18,000 |
| | నాలుగు లక్షల శ్లోకములు | ద్వా. 48 | 4,00,000 |

## శ్రీవైకుంఠపట్టణవర్ణనము

సీ. సూర్యచంద్రానల స్ఫురణలఁ జొరనీక
నిజదీధితిస్ఫూర్తి నివ్వటిల్ల
దివ్యమణి ప్రభాదీపిత సౌధవి
మానగోపుర హర్మ్య మంటపములుఁ
ప్రసవగుచ్ఛ స్వచ్ఛభరిత కామిత ఫల
సంతాన పాదప సముదయములుఁ
గాంచన దండసంగతమారుతోద్ధూత
తరళ విచిత్ర కేతనచయములు
తే. వికచకైరవదళదరవిందగతమ
రంద రసపానమోదితేందిందిర ప్ర
భూతమంజులనినద ప్రబుద్ధరాజ
హంసశోభితవర కమలాకరములు. ద్వి. 227

ప్ర.—శ్రీవైకుంఠపురవాసు లెట్టివారు ?

ఉ.—ఉ. ఆమహనీయపట్టణమునందు వసించెడువారలాత్మని
ష్కామఫలంబె సత్ఫలముగాఁ దలపోసి ముముక్షుధర్ములై
శ్రీమహిళాధిపాంఘ్రిసరసీరుహపూజలొనర్చుచున్మహో
ద్దామతవేయరూపములఁదాల్చిసుఖించుచునుందు రెప్పుడున్.
తృ. 505

## శ్రీమద్వైకుంఠమందిర వర్ణనము

సీ. వెలనొప్పఁగా "నదైవం కేశవాత్పర"
మ్మని పల్కురాజ కీరావళియును

మహిమ "జగద్విష్ణుమయ మఖిల"మ్మని
చదివెడు శారికా సముదయంబు
నేపారఁగా "జితంతేపుండరీకాక్ష"
యని లీలఁబాడు పికావళియును
లలిమీఱఁగా "మంగళం మధుసూదన"
యనుచు బల్కెడి మయూరావళియును
తే. దవిలి శ్రౌషడ్స్వషసధేత్యాది శబ్ద
కలితముగ మ్రోయు మధుపనికాయములును
గలిగి యఖిలైక దివ్యమంగళవిలాస
మహిమఁ జెన్నొందు వైకుంఠమందిరంబు. ద్వి. 228

ప్ర.—శ్రీవైకుంఠపట్టణమునందలి పార్శ్వచరు లెట్టివారు ?

ఉ.—సీ. సలలితేం దీవరశ్యామాయ మానోజ్జ్వ
లాంగులు నవ్యపీతాంబరులును
ధవళారవింద సుందరపత్త్ర నేత్రులు
సుకుమారతనులు భాసుర వినూత్న
రత్నవిభూషణ గ్రైవేయ కంకణ
హార కేయూర మంజీరధరులు
నిత్యయౌవనులు వినిర్మలచరితులు
రోచిష్ణులును హరిరూపధరులు
తే. నగు సునందుండు నందుండు నర్హణుండు
బ్రభలుఁడును నాదియగు నిజపార్శ్వచరులు
మఱకతు వైదూర్య విద్రుమామల మృణాళ
తుల్యగాత్రులు దనుభక్తితోఁ భజింప. ద్వి. 230

## శ్రీమహావిష్ణు వర్ణనము

సీ. క్షాళితాఖిల కల్మష వ్రజామరనదీ
జనకకోమల పదాబ్జముల వాని
నఖిలసంపత్కారణాపాంగ లక్ష్మీ వి
లాసిత వక్షస్స్థలంబు వాని
పద్మమిత్రామిత్ర భాసురలోచన
నలినసుందర వదనముల వాని
భువన నిర్మాణ నైపుణభవ్యనిజజన్మ
కారణనాభిపంకజమువాని
తే. నహిహితాహితశయన వాహములవాని
సేవితామర తాపసశ్రేణివాని
నఖిలలోకంబులకు గురుండైనవానిఁ
గాంచె బరమేష్ఠిగన్నుల కఱవుదీఱ. ద్వి. 231

క. కమనీయరూపరేఖా
రమణీయతఁ జాల నొప్పు రమణీమణియ,
క్కమలాలయ దనమృదుకర
కమలంబుల విభునిపాదకమలలొత్తెన్. ద్వి. 232

శా. శ్రీకాంతాతిలకంబు రత్నరుచిరాజప్రేంఖితస్వర్ణడో
లా కేళిఁ విలసింపఁదత్కచభరాలంకృతస్రగ్గామోదలో
భాకీర్ణప్రచురస్మధువ్రత మనోజ్ఞాలోలనాదంబుల
స్తోకానుస్వరలీలనొప్పఁగనిజేశుఁ వేడ్కతో బాడఁగన్.

ద్వి. 234

అట్టినిత్య విభూతియందు:—

మ. సతతజ్ఞాన రమాయశోబల మహైశ్వర్యాతియుక్తుఁ జగ
త్పతి యజ్ఞేశు ననంతునచ్యుతు దళత్పంకేరుహాక్షుఁ శ్రియః,
పతినాద్యంత వికారదూరుఁ గరుణాపాథోనిధిఁ సాత్వతాం
పతివర్ధిష్ణు సహిష్ణువిష్ణు గుణవిభ్రాజిష్ణు రోచిష్ణునిన్. ద్వి. 236

మ. దరహాసామృతపూరి తాస్య నిజభక్తత్రాణపారాయణు
న్నరుణాంభోరుహపత్రలోచనుని బీతావాసు త్రైలోక్యసుం
దరుమంజీర కిరీటకుండల ముఖోద్యద్భూషు యోగీశ్వరే
శ్వరలక్ష్మీయుతవక్షుఁ జిన్మయుఁ దయాసాంద్రుఁ జతు
ర్బాహునిన్. ద్వి. 237

శ్రీమద్ద్వారకానగరవర్ణనము:—

సీ. శుకశారికాశిఖిపికకూజిత ప్రస
నాంచితోద్యానవనౌఘములను
గలహంససారసకైరవ కమలకల్హార
శోభితకమలాకరములఁ
గలమాది సస్యసంకులవరేక్షుక్షేత్ర
భూరిలసన్నదీతీరములను
గిరిసానుపతిత నిర్ఝరకణసందోహ
సంతత హేమంత సమయములను

తే. గమేఁసంభవకాంచననాకారరచిత
చిత్రైశ్వర్య నగరలక్ష్మీకరాబ్జ,
ఘటితనవరత్నమయ హేమకటకమనఁగ
సొబగుమీఱఁజేసికోటయుఁ జూచెమాని. ద ఉ. 600

సీ. పటికంపుఁగంబముల్ పవడంపుఁ బట్టెను
మరకత రచితముల్ మదిర లమర
వైడూర్యమణిగణవలభులఁ బద్మరా
గంబుల మొగడులకాంతులొలయ
సజ్జాతివజ్రలసజ్జాలరుచులతో
భాసిల్లునీలసోపానములును
గరుడపచ్చల విటంకములును ఘనరుచి
వెలసిన శశికాంతవేదికలును

తే. వఱలుమౌక్తిక ఘటితకవాటములును
బ్రవిమలస్వర్ణమయ సాలభంజికలును,
మించుకలరవ మెసఁగఁ గ్రీడించుమిథున
లీలనొప్పుకపోతపాలికలుఁ గలిగి. ద. ఉ. 602

తే. చేటికానీకపదతులాకోటిమధుర
నినదభరిత మై రుచిర మాణిక్యదీప,
మాలికయుఁ గల్గి చూపట్టుఁ గ్రాలు నొక్క-
జలజలోచన నిజసౌధతలమునందు. ద. ఉ. 603

తే. కనకకంకణ ఝణఝణత్కారకలిత
చంద్రబింబాన నాహస్తజలజఘటిత,
చామరోద్ధూత మారుతచలితచికుర
పల్లవుఁగఁ గృష్ణువల్లవీ పల్లవుని. ద. ఉ. 604

### శ్రీ శివకేశవులకభేదము



సీ. తనువున నంటినధరణీపరాగంబు
పూసిన నెఱిభూతిపూఁతగాగ

ముంగల వెలుఁగొందు ముక్తాలలామంబు
తొగల సంగడికాని తునుక గాఁగ
ఫాలభాగంబుపైఁ బరఁగుకావిరి బొట్టు
కాముని గెల్చిన కన్ను గాఁగఁ
గంఠమాలికలోని ఘననీల రత్నంబు
గమనీయమగు మెడగప్పు గాఁగ

ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ
బాలలీలఁ బ్రౌఢబాలకుండు,
శివునిపగిదినొప్పె శివునికిఁదనకును
వేఱు లేమిఁ దెల్పవెలయునట్లు. ద. పూ. 297

ప్ర—ఎట్టిగృహము యోగ్యమైనది?

ఉ—

చ. అరయ ధరిత్రి నెవ్వనిగృహంబు మహాత్మజనోపయోగ్యవి
స్ఫురితతృణాంబు భృత్యగృహభూములసారెఁదనర్చునట్టిమం
దిరపతి పేద నైన జగతిం గడుధన్యుఁడ టంద్రు గాన సు
స్థిరమతి మీరువచ్చుట ననేకశుభంబుల నేను బొందెదన్.
చ. 603

ప్ర—ఎట్టిగృహ మయోగ్యమైనది?

ఉత్త—

చ. వరమతులార యెవ్వని నివాసముఁ దీర్థపదాంతరంగులై
పరగిన యట్టిభాగవత పాదజలంబులు సోకవేని న
త్పురుషుఁడు భూరిసంపదలఁబొంపిరి పోయిననైన వారిమం
దిర మురగప్రకీర్ణజగతీజముఁ బోలు నటంద్రు కోవిదుల్.
చ. 610

ప్ర—భక్తికృతార్థులైన వా రెవరు ?

ఉ—సీ. గాధి గయాంసు రేక్ష్వాకు దిలీప మాం
ధాతృ భీష్మ శుక యయాతి సగర
రఘు ముచుకుం దైళ రంతి దేవోద్ధవ
సారస్వ తోదంక భూరిషేణ
శ్రుతదేవ మారుతి శతధన్వ పిప్పల
బలి విభీషణ శిబి పార్థవిదుర
ంబరీష పరాశ రాలర్క మిథిలేశ్వ
రాను సౌభరి దేవ లాభిమన్యు

తే. లార్ష్టిషేణాదు లైనమహాత్ములెలమిఁ
దవిలి యద్దేవు భక్తి జిత్తముల నిల్పి,
తత్పరాయణులౌట దుర్దాంతమైన
విష్ణు మాయదరింతురు విమలచరిత. ద్వి. 204

మ. అనఘా వీరల నెన్న నేమిటికి దిర్యగ్జంతు సంతానప
క్షినిశాటాటవికాఘ జీవనివహస్త్రీ శూద్రహూణాదులై
నను నారాయణభక్తి యోగమహితానందాత్ములై రేనివా
రనయంబుఁదరియింతురవ్విభునిమాయావైభవాంభోనిధిన్. ద్వి. 205

ప్ర—భక్తియెన్నివిధములు ?

ఉత్త—

మ. తనుహృద్భాషలసఖ్యముఁ శ్రవణముఁ దాసత్వముఁ వంద
నార్చనముల్ సేవయు నాత్మలో నెరుకయుఁ సంకీర్తనల్
చింతనం,బను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముఁ హరిఁ

నమ్మిన, జ్ఞనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతుఁ సత్యంబు
వైతోక్త్తమా. స. 167

ప్ర.—భాగవతు లెట్టివారు ?

ఉ.—సీ. శ్రుత్యంత విశ్రాంతమత్యనుక్రమణీయ
భగవత్ప్రసంగతుల్ భాగవతులు
సనకాదిమునియోగి జనసదానందైక
పరమభాగ్యోదయుల్ భాగవతులు
కృష్ణపదధ్యానకేవలామృత పాన
పరిణామయుతులు శ్రీభాగవతులు
బహుపాతకానీక పరిభవ ప్రక్రియా
పరుషోగ్రమూర్తులు భాగవతులు

తే. భావతత్త్వార్థవేదులు భాగవతులు
బ్రహ్మవాదానువాదులు భాగవతులు,
సిరులు దనరంగ నెన్నఁడుఁ జేటులేని
పదవినొప్పారువారువో భాగవతులు. ష. 186

క. పొడిచిన దిట్టినగొట్టిన
బడుచుందురుగాని పరమభాగవతులు దా,
రొడఁ బడరుమాలుసేయఁగఁ
నొడుకా విభుఁ డెగ్గుసేయఁగోరఁడు నీకున్. ప్ర. 48

ఉ. ఎవ్వరు సిద్ధసాధ్యఖచరేశుల సత్పరిగీతగాథలం
దెవ్వరు ముక్తిభోగతల హేమమనోహరచంద్రశాలలం
దెవ్వరు శంఖచక్రగురుహేతిగదారుచిరోగ్రపాణులా
మవ్వపురూపవంతు లసమానులువో ధరలోనివైష్ణవుల్
ష. 185

ప్ర—భగవద్భక్తులతోఁటి సంభాషణ ఎట్టిది ?

ఉ—క. హరిభక్తులతోమాటలు
ధర నెన్నఁడుఁ జెడనిపుణ్యధనములమూటల్
పరముక్తికాంతతేటలుఁ
నరిషడ్వర్గంబు సొరనియకుడగుకోటల్. ష. 153

క. హరిదాసులమిత్రత్వము
మురరిపు కథలెన్నికొనుచు మోదముతోడన్
భరితాశ్రుపులకితుండై
పురుషుఁడు హరిమాయగెలుచు భూపవరేణ్యా. ఏ. 55

ప్ర—ఏఏ భక్తితో ఎవరెవరు కృతార్థులైరి ?

ఉత్త—

శా. కామోత్కంఠతగోపికల్ భయమునన్ గంసుండువైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తినేమునిదె చక్రింగంటిమెట్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుఁడైన హరిఁజెందన్ వచ్చు ధాత్రీశ్వరా.
స. 18

ప్ర.—అన్నిటికంటె భక్త్యతిశయము ?

ఉత్త—

మ. వినుమంభోజభవుండు మున్నుమదిలోవేదంబు మున్మూ నె
నెమ్మనమందుందలపోసి యెంతయు బరామర్శించి మోక్షంబుద
క్కనమార్గంబులవెంట లేదనుచు భక్తిన్ బూజనేసెంజనా
ర్దను నాత్మాకృతి నిర్వికారుఁడగుచున్ దన్మార్గనిర్ణేతయై.

ప్ర.—సరస్వతీర్థంబున నొంటియుండి హేతువువితర్కించుచు శ్రీవ్యాసభగవానులు వ్యాకులచిత్తముతో వారేమనుకొనిరి?

ఉ.—సీ. వ్రతధారినై వేదవహ్నిగురు శ్రేణి
మన్నింతు విహితకర్మములఁ గొఱఁత
పడకుండనడపుదు భారతమిషమునఁ
బలికితి వేదార్థభావమెల్ల
మునుకొని స్త్రీశూద్ర ముఖ్యధర్మములందు
దెలిపితి నేఁ జెల్లదీనఁజేసి
యాత్మ సంతసమంద దాత్మలోనీశుండు
సంతసింపకయున్న జాడదోఁచె

గీ. హరికియోగివరుల కభిలషితంబైన
భాగవతవిధంబుఁ బలుకనైతి
మోసమయ్యెఁ దెలివిమొనయదు మఱచితి
ననుచు వగచుచున్న యవసరమున. ప్ర. 85

ప్ర.—శ్రీవేదవ్యాసమహర్షిని భాగవతము వ్రాయమని చెప్పిన దెవరు?

ఉ.—నారదమహర్షి.

ఉ. అంచిత మైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోననిం
చించుకగాని విష్ణుకథ లేర్పడజెప్పవు ధర్మముల్ ప్రప
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినగాక నీకునీ
కొంచెము వచ్చునెల్ల హరి గోరి నుతింపుమి నార్యపూజితా.
ప్ర. 95

ప్ర—శ్రీవ్యాసభగవానులు భాగవతము వ్రాసిన దెచ్చట ?

ఉ—వ. బ్రహ్మదైవత్యమైన సరస్వతీ పశ్చిమతీరంబున ఋషులకు
సత్త్రకర్మవర్ధనంబయి బదరీషండమండితంబైన శమ్యాప్రాసం
బనం బ్రసిద్ధంబగు నాశ్రమంబు గలదు. అందు జలంబుల
వార్చికూర్చుండి వ్యాసుండు మనమిం దిరంబు జేసికొని
భక్తియుక్తంబయిన చిత్తంబును పరిపూర్ణుండైన
యీశ్వరుంగాంచి వ్రాసిరి. ప్ర. 135

ప్ర—వ్రాసి వారేమిచేసిరి ?

ఉ—క. హరిగుణవర్ణన రతుఁడై
హరితత్పరుఁడైన బాదరాయణి శుభత
త్పరతం బఠించె ద్రిజగ
ద్వరమంగళమైన భాగవతనిగమంబున్. ప్ర. 139

ప్ర—భాగవతమును వినినమాత్రముననే గలుగు లాభమేమి ?

ఉత్త—

మ. అవనీ చక్రములోన నేపురుషుఁడే యామ్నాయము౯ విన్న
మాధవుపై లోకశరణ్యుపై భవములందప్పింపగాఁ జాలు భ
క్తివిశేషంబుజనించు నట్టి భువనక్షేమంకరంబైన భాగవతా
మ్నాయము బాదరాయణుఁడుదాఁ గల్పించెనేర్పొప్పఁగన్.
ప్ర. 136

ప్ర—శ్రీహరినామస్తుతిగలకావ్య మెట్టిది ? లేనికావ్య మెట్టిది ?

ఉత్త—

మ. హరినామస్తుతి సేయుకావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానససరస్స్ఫూర్తి౯ వెలుంగొందు శ్రీ

హరినామస్తుతిలేనికావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండదు యోగ్యవర్తులకు కాకోలగర్తాకృతిన్.
ప్ర. ౧౬

ప్ర.—శ్రీభాగవతము నాంధ్రీకరించిన దెవరు?

ఉ.—1. భక్తాగ్రేసరుడు, 2. పరిజనానందకరుడు, 3. కవిసార్వభౌముడు, 4. కృషికుడు శ్రీబమ్మెరపోతనామాత్యుడు.

ప్ర.—వీరిజన్మస్థల మెచ్చట?

ఉ.—నైజాము ఇలాకా ఓరుగల్లని కొందరు, కడపజిల్లా ఒంటిమిట్టయని కొందరు.

ప్ర.—వీరెప్పుడుండిరి యెన్ని సంవత్సరములు?

ఉ.—హూణశకము 1373 మొదలు 1435 వరకు 62 సం॥లు.

ప్ర.—శ్రీభగవన్నామము యెవరిని పవిత్రతజేయును?

ఉ.—శ్లో. వాసుదేవకథా ప్రశ్నః పురుషాం స్త్రీన్ పునాతివై
వక్తారం పృచ్ఛకం శ్రోతౄన్ తత్పాదసలిలం యథా.

క. విష్ణుకథారతుఁడగు నరు
విష్ణుని కథఁ జెప్పుమనుచు వినుచుండునరున్
విష్ణుకథాసంప్రశ్నము
విష్ణుపదీజలము భంగి విమలులఁ జేయున్.

ప్ర.—కృతివక్త ఎవరు?

ఉ.—శ్రీబమ్మెర పోతనామాత్యుడు.

ప్ర.—కృతిభర్త ఎవరు?

ఉ.—శ్రీరామచంద్రప్రభువు.

ప్ర.—కృతికర్త తనకు భగవద్దర్శనలాభ మెట్టుల గలిగెనని వ్రాసిరి?

ఉ.—వ. అని మఱియు మదీయపూర్వపుణ్య సహాయసంచిత ఫలంబునఁ శ్రీమన్నారాయణ కథా ప్రపంచవిరచనా కుతూహలుండనై యొక్కరాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకం గని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్రసముత్తుంగ భంగయగు గంగకుం జని, క్రుంకులిడి వెడలి మహనీయమంగళ పులినతలంబున మహేశ్వరధ్యానంబు జేసి కించిదున్మీలితలోచనుండనై యున్నయెడ. ప. 15

సీ. మెఱుఁగుచెంగటనున్న మేఘంబు కైవడి
నువిదచెంగట నుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారంబు పోలిక
ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుతతమాలవసుమతీజము భంగి
బలువిల్లు మూఁపున బరఁగువాఁడు
నీలనగాగ్ర సన్నిహితభానునిభంగి
ఘనకిరీటము దలఁ గలుగువాఁడు

గీ. పుండరీకయుగముఁ బోలుకన్నులవాఁడు
వెడఁదయురమువాఁడు విపులభద్ర
మూర్తియైన రాజముఖ్యుఁ డొక్కఁడు నా
కన్నుఁగవకు నెదుర గానఁబడియె. ప. 16

ప్ర.—ఏ కారణమున చెప్పవలసివచ్చెను ?

ఉ.—వ. కృష్ణుండు ధర్మజ్ఞానాదులతోడం దనలోకంబునకుం జనిన పిమ్మటం గలికాలదోషాంధకారంబున నష్టదర్శనులయిన జనులకు నిప్పుడీ పురాణంబు కమలబంధుని భంగి నున్నది. నాఁడందు సూరితేజుండయి కీర్తించుచున్న విప్రర్షివలననే పఠించిన క్రమంబున నామదికి గోచరించినంతయు వినిపించెదననిన సూతునకు మునివరుండైన శౌనకుం డిట్లనియె. ప్ర. 74

ప్ర.—వారటుల దర్శనమిచ్చి ఏమని సెలవిచ్చిరి ?

ఉ.—వ. నేఁ రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబు దెనుంగుసేయుము నీకు భవబంధంబులు దెగునని యానతిచ్చి తిరోహితుండైన. ప్ర. 17

ప్ర.—కృతికర్తప్రతిజ్ఞ ఏమి ?

ఉ.—క. పలికెడిది భాగవతమట
పలికించెడువాడు రామభద్రుండట నే
బలికిన భవహరమగునట
పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా. ప్ర. 18

ఉ. భాగవతముఁ దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనులవలన విన్నంత కన్నంత
దెలియవచ్చినంత దేటపఱుతు. ప్ర. 19

క. కొందఱకుఁ దెనుఁగుఁ గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం

గొంపజను గుణములగునే
నంపదలమెప్పింతుఁ గృతులనమ్మ్యు యెడలన్. ప్ర. 20

ఆ. భాగవతముఁ దేటపఱుప నెవ్వఁడుసాలు
శుకుఁడు దక్క నరుని సఖుఁడుదక్క
బుద్ధిదోఁచినంత బుధులచే విన్నంత
భక్తినిగిడినంత పలుకువాఁడ. ప. 23

ప్ర—ప్రబంధహేతులేమి ?

ఉ—తే. చేతులారంగ శివుని పూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని,
దయయు సత్యంబులోనుగా దలఁపఁడేని
గలుగనేటికిఁ దల్లులకడుపుఁ జేటు. ప్ర. 14

ప్ర—కృతివక్తనిర్ణయమేమి ?

ఉత్త—

ఉ. ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరముఁ వాసికాలుచే
సమ్మెటవ్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పెనీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్. ప్ర.13

ప్ర—కృతివక్త తన భాగ్యప్రశంస ఏం చెప్పుకొనెను ?

ఉ. త్త—

మ. ఒనరన్నన్నయ దిక్కనాదికవులీ యుర్వింబురాణావళుల్
తెనుఁగుంజేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుంజేయరుమున్ను భాగవతమున్ దీనిం దెనింగించినా
జననంబున్ సఫలంబుసేసెద బునర్జన్మంబు లేకుండఁగన్. ప్ర.21

ప్ర — గ్రంథప్రాశస్త్యమేమి ?

ఉ — సీ. శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతంబైన
భాగవతంబు సద్భక్తితోడ
వినఁగోరువారల విమలచిత్తంబుల
జెచ్చెర నీశుండు చిక్కుఁగాక
యితరశాస్త్రంబుల నీశుండు చిక్కునే
మంచివారలకు నిర్మత్సరులకు
గపటనిర్ముక్తులై కాంక్ష సేయకయును
దగిలియుండుట మహాతత్త్వ బుద్ధిఁ

తే. బరఁగనాధ్యాత్మికాది తాపత్రయంబు
నడఁచి పరమార్థభూతమై యధికసుఖద,
మైనమస్తంబుగాకయు నయ్యనుండు
వస్తువెఱుఁగంగఁదగు భాగవతమునందు. ప్ర. 36

ఉ. ఎయ్యది కర్మబంధములనెల్ల హారించు విభూతికారణం
బెయ్యది సత్కవీంద్రులకునెల్లఁ గవిత్వసమాశ్రయంబు ము
న్నెయ్యది సర్వమంత్రముల నేలిన దెయ్యదిమోక్షలక్ష్మి రూ
పెయ్యది దానిబల్కెద సుహృద్యము భాగవతాఖ్య మంత్ర
మున్. ష. 14

ప్ర — శ్రీభాగవతతత్త్వము తెలిసినవారెవరు ?

ఉ — సీ. పరమహాద్భుతమైన వైష్ణవజ్ఞానంబుఁ
నికముగా నెవ్వరు దెలియఁగలరు
దేవాదిదేవుండు త్రిపురసంహరుఁడొండెఁ
గమలసంభవుఁ డొండెఁ గార్తికేయ

కపిలనారదులొండె గంగాత్మజుండొండె
మనువొండె బలియొండె జనకుడొండెఁ
బ్రహ్లాదుఁ డొండెనేర్పాటుగా శుకుడొండె
భాసురతరమతి వ్యాసుఁ డొండెఁ
గాకయన్యులతరమె యీలోకమందు
నీసుబోధంబు సద్బోధమీపదార్థ
మీసదానంద చిన్మయ మీయగమ్య
మీవిశుద్ధంబు గుహ్యంబు నీశుభంబు. ష. 178

క. ఈపన్నిద్దఱుదక్కఁగ
నోపరు తక్కొరులు దెలియ నుపనిషదుచిత
శ్రీపతినామమహాద్భుత
దీపిత భాగవత ధర్మ దివ్యక్రమమున్. ష. 179

ప్ర.—ఎప్పుడు తెలియనివారెవరు ?

ఉ.—క. ఎన్నఁడుఁ దెలియగనేరరు
పన్నగ పతిశాయి తత్త్వభావము మేనం
గన్నులవేల్పును దాపల
జన్నమరివేల్పు ముదుక చదువులవేల్పున్. ష. 177

ప్ర.—కేవలవిషయ సుఖానుభవముగల వారు దేనికి పోల్చబడిరి.

ఉ.—సీ. అలరుజొంపములతో నభ్రంకషంబులై
బ్రతుకవే వనములఁ బాదపములు
ఖాదన మేహనాకాంక్షలఁ బశువులు
జీవింపవే గ్రామసీమలందు

నియతమై యుచ్ఛ్వాస నిశ్వాసపవనముల్
ప్రాపింపవే చర్మభస్త్రికలును
గ్రామ సూకర శునకశ్రేణు లింటింటఁ
దిరుగవే దుర్భోగ దీనవృత్తి
గీ. సుష్ఠుఖరములు మోవవే యురుభరములఁ
బుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు
లడవులందు నివాసములందుఁ బ్రాణ
విషయ భరయుక్తితో నుంట విఫలమధిప. ద్వి. 49

ప్ర—భగవద్విరహితులగతి ఏమి?

ఉ—సీ. నీగృహాంగణ భూమి నిటలంబు మోవంగ
మోడించి నిత్యంబు మ్రొక్కఁడేని
నీమంగళస్తవనికరవర్ణంబులు
పలుమాఱు నాలుక బలుకఁడేని
నీయధీనములుగా నిత్యకృత్యంబులు
ప్రియభావమున సమర్పింపఁడేని
నీపదాంబుజముల నిర్మలహృదయుఁడై
చింతించి మక్కువఁ జిక్కఁడేని
గీ. నిన్నుఁ జెవులారవినఁడేని నీకు సేవ
సేయరాఁడేని బ్రహ్మంబు జెందఁగలఁడె
యోగియైనఁ దపోవ్రతయోగియైన
వేదియైన మహాతత్త్వవేదియైన. స. 367

ఉ. పూని యనేకజన్మములఁబొంది తుదిం దన పుణ్యకర్మ సం
తానము పేర్మిఁ గర్మవసుధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుఁడై

మానవుఁడై గృహేచ్ఛఁ బహుమందుఁడజంబుతృణాభిలాషియై
కానక పోయి నూతఁ బడు కైవడి నీపదభక్తిహీనుఁడై.
ద. పూ. 1654

తరల. హరినెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుఁడై
పొరలుచుండెడి పెట్టిముక్తికిఁ బోవనేర్చునె నాఁడు సం
సరణముం బెడఁబాయఁ డెన్నఁడు సత్యమాహరినామ సం
స్మరణ మొక్కముహూర్తమాత్రము చాలుముక్తికిమానృపా.
ద్వి. 8

మ. హరిఁ జింతింపక మత్తుఁడై విషయచింతాయత్తుఁడై చిక్కి వా
సరముల్ ద్రోసెడువాఁడు కింకరగదా సంతాడితోరస్కుఁడై
ధరణీశోత్తమ దండభృన్నివసనద్వారోప కంఠోగ్రుఁడై
తరణీవహ్నిశిఖాపరంపరలచే దగ్ధుండు గాకుండునే ద్వి. 24

క. మొత్తుదురు గదల మంటల
కెత్తుదు రడ్డంబు దేహ మింతింతలు గా
నొత్తుదు రసిపత్త్రికలను
హత్తుదురు కృతాంతభటులు హరివిరహితులన్. ద్వి. 25

క. శ్రీవనితాధిపనామ క
థా విముఖుల కిహముఁ బరము దవ్వై విపదం
బోవుదురు నరకముకుఁగా
వారిరి నే వారిఁజూచి వగతు మునీంద్రా. తృ. 192

క. ఏనరుఁడే నొకనిమిషం
బైన వృథావాదగతిని హరిపదకమల

ధ్యానానందుఁడు గాఁడే
నానరునకు నాయు వల్ప మగు మునినాథా. తృ. 103

శా. అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గ్రంథంబుల్ హరిభక్తివర్జితులరిక్తవ్యర్థ సంసారముల్.
స. 168

క. హరిమహిమ దనకుఁ జెప్పిన
గురువుఁ నరుఁడనుచుఁ దలఁచి కుంఠిత భక్తిన్
దిరుగు పురుషు శ్రమమెల్లను
గరిశౌచము క్రియ నిరర్థకంబగు నధిపా. స. 458

మ. మిము సద్భక్తి భజింపనొల్లకిల దుర్మేధం బ్రవర్తించు నీ
చమతివ్రాతము నేర్పునం బసులఁ బాశశ్రేణి బంధించు చం
దమునం బెక్కగు నామరూపములచేతన్ వారిబంధించి దు
ర్గమ సంసారపయోధిఁ ద్రోతువు దళత్కంజాతపత్రేక్షణా.
ద. ఉ. 1222

ప్ర.—ఏ ఏ విషయములలో అసత్యమాడవచ్చును.

ఉ.—ఆ. వారిజాక్షులందు వైవాహికము లందుఁ
బ్రాణ విత్తమాన భంగమందుఁ
జకిత గోకులాగ్ర జన్మరక్షణమందుఁ
బొంకవచ్చు నఘము వొందఁ డధిపా. అ. 585

ప్ర.—తపోధను లుండవగినస్థలమేది ?

ఉ.—సీ. కమనీయ భూమిభాగములు లేకున్నవే
పడియుండుటకు దూదిపఱుపులేల
సహజంబులగు కరాంజలులు లేకున్నవే
భోజనభాజన పుంజమేల
వల్కలాజిన కుశావళులు లేకున్నవే
కట్ట దుకూల సంఘంబులేల
గొనకొని వసియింప గుహలు లేకున్నవే
ప్రాసాద సౌధాదిపటల మేల
తే. ఫలరసాదుల గురియవేపాదపములు
స్వాదుజలములనుండవే సకలనదులుఁ
బొసఁగ భిక్షము వెట్టరే పుణ్యసతులు
ధనమదాంధుల కొలువేల తాపసులకు. ద్వి. 21

ప్ర.—మానవకృత్యమేమి ?
ఉ.—సీ. సంతతంబును కృష్ణసంకీర్తనంబులు
వీనులకింపుగా వినఁగవలయు
హర్షంబుతోడుత హరినామకథనంబు
పాటలనాటలఁ బఱఁగవలయు
నారాయణుని దివ్యనామాక్షరంబులు
హృద్వీథిసతతంబు నిలుపవలయుఁ
గంజాక్షులీలలు కాంతారముల నైన
భక్తియుక్తంబుగాఁ బాడవలయు
తే. వెఱ్ఱిమాడ్కినిలీలతో విశ్వమయుని
నొడువుచును లోకబాహ్యతనొందవలయు

నింతయును విష్ణుమయమని యెఱుఁగవలయు
భేదమొనరింపవలవదు మేదినీశ. ఏ. 44

క. హరిదాసుల మిత్రత్వము
మురరిపు కథలెన్ని కొనుచు మోదముతో డగ్
భరితాశ్రు పులకితుండై
పురుషుఁడు హరిమాయ గెల్చు భూపవరేణ్యా. ఏ. 55

ప్ర—కడుపుచేటు బిడ్డలెట్టివారు ?
ఉ.—తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తినుడువఁడేని
దయయు సత్యంబులోనుగా దలఁపఁడేని
గలుగనేటికిఁ దల్లులకడుపుఁజేటు. ప్ర. 14

అ. కడుపు బదరగాఁగ గొడుకులఁ గనుకంటె
దల్లి కొకఁడెచాలు బల్లిదుండు
త్రిదశగణముఁ గన్న యదితిగానుపుగీటఁ
జిన్ని మేటివడుగుఁ గన్న యట్లు. అ. 685

ప్ర—యమధర్మరాజు తమ దూతలతో ఎవరిని తెమ్మని ఆజ్ఞాపించెను.

క. అదిగాక విష్ణుభక్తులఁ
గదియఁగఁ జనవలదుమీరుకరివరదుల స
త్పద పద్మవినతి విముఖులఁ
దుదినంటఁగఁ గట్టితెండు ధూర్తులువారల్. ష. 187

ఉ.—సీ. ఎకసక్కెమునకైన నిందిరారమణునిఁ
బలుకంగలేని దుర్భాషితులను

గలలోనసైన శ్రీకాంతుని సత్పాద
కమలముల్ సూడని కర్మదృశుల
సవ్వచునైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిఁ
దార్పనేరని దుష్కథాప్రవణుల
యాత్రోత్సవంబులనైన నీశునిగుడి
త్రోవ ద్రొక్కఁగలేని దుష్పదులను
తే. బరమభాగవతుల పాదధూళి సమస్త
తీర్థ సారమనుచుఁ దెలియలేని-
వారి వారివారి వారిఁ జేరినవారిఁ
దోలుత కట్టితెండు దూతలారా. ప. 183

ఆ. ఎల్లపాపములకు నిల్లైన యింటిలో
బద్ధతృష్ణలగుచు బుద్ధివఁదలఁగి
పరమహంసులము మఱిదప్పివర్తించు
ధూర్తజనులఁ దెండు దూతలార. ప. 189

ప్ర—ఎవరిని లేవలదని ఆజ్ఞాపించెను.

ఉ. ఆ. పద్మనయనుమీఁది భక్తియోగంబెల్ల
ముక్తియోగమనుచు మొదలెఱుంగు
వారి వారివారి వారిఁజేరినవారి
త్రోవఁ దలఁపవలదు దూతలారా. ప. 191

ప్ర—ఎటువంటివానిని నేనుభరించలేనని భూదేవి చెప్పినది.

ఉ—సీ. నిజమానతిచ్చితి నీవు మహాత్మక
మహిని గృహస్థధర్మంబు నిడియ
యర్థంబుఁగామంబు యశమును వృత్తియు
నెయ్యది ప్రార్థింపనిత్తు ననియు

నర్థలోభంబున నర్థిఁ బొమ్మను నెట్లు
పలికి లేదనుకంటెఁ బాపమెద్ది
యెట్టిదుష్కర్ముని నేభరించెదఁగాని
సత్యహీనుని మోవఁ జాలననుచుఁ
తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరమునఁనుండి తిరుగకచచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరగుకంటె
మానధనులకు భద్రంబుమఱియుఁగలదె. అ. 583

ప్ర.—భగవంతుడని పేరెందుకువచ్చినది ?

ఉ. క. అగుణుండగు పరమేశుడు
జగములఁ గల్పించుకొఱకుఁ జతురతమాయా
సగుణుండగుఁ గావునహరి
భగవంతుండనఁగబరగె భవ్యచరిత్రా. ద్వి. 99

క. విశ్వాత్ముఁడు విశ్వేశుడు
విశ్వమయుం డఖిలనేతవిష్ణుఁడజుండీ
విశ్వములోఁ దానుండును
విశ్వము దనలోనఁ జాలవెలుఁగుచునుండన్. ద్వి. 100

ప్ర.—భగవంతుడుండు స్థలమేది ?

ఉ. క. హరిమయము విశ్వమంతయు
హరివిశ్వమయుండు సంశయముపనిలేదా
హరిమయముగాని ద్రవ్యము
పరమాణువులేదువంశపావనవింటే. ద్వి. 17

మ. కలఁడంభోధి గలండుగాలి గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁడగ్నిన్ దిశలన్ బగళ్లనిశలన్ ఖద్యోతచంద్రాత్మలన్
గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలిఙ్గవ్యాప్తులందంతటం
గలఁడీశుండు గలండుతండ్రి వెదుకంగానేల నీయాయెడన్.
స. 274

క. ఇందుఁ గలఁ డందులేఁడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే. స. 275

ప్ర—నిష్కామకర్మ ఎంతగొప్పది (శ్రేష్ఠమైనది)?

ఉ. తే. అరయనిష్కామ ధర్ములైనట్టిభక్తు
లందు నీవు ప్రసన్నుండవై సరితి
హృదయముల బద్ధకాములై యెనయుదేవ
గణములందుఁ బ్రసన్నతగలుగవీవు. తృ. [illegible]9

క. పరఁగ సుధాశన తిర్య
ఙ్నరవివిధస్థావరాది నానాసృష్టి
స్ఫురణ సజుం డొనరించెం
బరువడి నిష్కామధర్మఫలరూపమునన్. తృ. 338

నిపుణుడైనవాని నిష్కర్మతకు మెచ్చువానికే నొనర్తువందనములు. గజేంద్రమోక్షము.

ప్ర—శ్రీభగవద్వాక్యమేమి?

ఉ—సీ. ఎవ్వని గరుణింప నిచ్ఛగించితి వాని
యఖిల విత్తంబునే నపహరింతు

భావించి వారి మఱతురు
భాగములఁ గృతఘ్నవృత్తి బని తమ పనిగన్. వ. ఉ. 1235

మ. నను సేవించుచునున్న వారలకునే నారూపముం జూపఁ జూ
చిరఁ జీవించి మదించి వారు మఱి నన్ సేవింపరో యంచు ని
ర్ధనులం జాత్మధనంబు నెడ్డ నెపుడు దత్పారవశ్యంబుఁ బా
ల్పను భంగిన్ ననుఁ బాసి మత్ప్రియులు నా జింతించు నారూ
పమున్. వ. భా. 1077

చ. నలమున బుద్ధిమంతు లగుసాధులు నాహృదయంబు లైనవాం
గిలిగొని పోవుచుందురు ధకిల్బిషభక్తి లతాచయంబులన్
నిలువఁగఁబట్టి కట్టుదురు నేనపుడో మనకుంధి కైవడిన్
వలలకుఁ జిక్కు భక్తజన వత్సలతన్ జనుచుండఁ దాపసా.
న 118

ఆ. నాకు మేలుగోరు నాభక్తులకు గాని
భక్తజనులకేను బరమగతియు
భక్తు లెందుఁ జనిరి యటవెంటనే వెంట
బోవువెంటఁ దగులు గోవుభంగి. న. 119

ఆ. తనువు మనువు విడిచి తనయులఁ జుట్టాల
నాలి విడిచి సంపదాలి విడిచి
నన్నుఁ గాని యన్యమెన్నఁడు నెఱుఁగని
వారి విడువ నెట్టివారినైన న. 121

క. పంచేంద్రియముల తెరువుల
వంచించి మనంబు నంపి పుమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నన్నును
మంచివనం బున్న యతులు మరగిన భంగిన్. న. 122

క. సాధుహృదయము నాయది
సాధుల హృదయంబు నేను జగములనెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాదు లెఱుంగుదురు నాదుచరితము విప్రా. న. 123

తే. వనతటాకోప నయనవివాహ దేవ
భవననిర్మాణ భూమ్యాది వివిధదాన
జపతపోవ్రతయోగయజ్ఞముల ఫలము
మామకస్తవఫలము సమంబుగాదు. తృ. 328

మ. క్రతువులుసేయుచో శిఖముఖంబున వ్రేలుచునట్టి తద్ఘృత
ప్లుతచరుభక్షణన్ ముదముఁ బొందదు నిస్పృహధర్మమార్గసం
గతుఁడగు భూసురోత్తమముఖంబున వేడ్కభజించునయ్యవి
స్కృతకబళంబులన్ మనము దృప్తి వహించినరీతి నిచ్చలున్.
తృ. 500

తరలము.—తగవు ధర్మముఁజూడ నొల్లకతల్లిదండ్రులబంధులన్
మగలబిడ్డలఁ బాసివచ్చిన మన్నిషక్తలమిమ్మునే
దగ దుపాసితిఁ దప్పునైఁపుడు తద్వియోగభరంబునన్
నగలఁబొందుచు మీరలాడినవాక్యముల్ వినుచుండితిన్.
ద. పూ. 1078

ఉ. పాయనిగేహ శృంఖలలఁబాసి నిరంతరమత్పరత్వముం
జేయుచునున్న మీకుఁ బ్రతిసేయయుగంబులనైన నేర
బాయక గొల్చుమానసము ప్రత్యుపకారముగాఁ దలంచినా
పాయుటఁ దప్పుగాఁగొనక భామినులార కృపన్ శమింపరే.
ద. పూ. 1079

సీ. కొలిచినఁ గొలుతురు కొందఱు పశువుల
భజనము భంగిని ఫలముఁకొఱకు
నైసఖ్య ధర్మములందు సిద్ధింపవు
కొందఱు తండ్రులగుణముఁదాల్చి
దయగలవారలు తగినసుహృత్తులు
గొలువనివారలఁ గొలుతురెప్పుడు
ధర్మకామంబులు దవరంగఁగొందఱు
కొలువనివారిని గొలుచువారె
తే. గొలుచుతలఁపులేమి గొలువరాత్మారాము
లాప్తకాములజ్ఞు లతికఠినులు
వారియందుఁబిదప వానిఁగాఁ జింతించి
యేలతాంగులార యిట్టులనుట. ద. పూ. 1075

క. ఏనిందెవ్వఁడ నయినం
గానంగనలార పరమకారుణికుండన్
మానసబంధుఁడ నిత్య
ధ్యానము మీకొసఁగవలసి తలఁగితిఁజుండీ. ద. పూ. 1076

క. సందేహము మానుం డర
విందాననలార మిమ్మువిడువనువత్తున్
బృందావనమున కని హరి
సందేశముబంపె ననుము సంకేతములన్. ద. పూ 1436

క. దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁబాయనిభక్తిం
గొలిచిన జనులర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేనుభుజింతున్. ద. ఉ. 1010

క. తపమనఁగ మత్స్వరూపము
తపమను తరువునకు ఫలవితానము నే నా
తపమునకే జననస్థి
త్యుపసంహరణము లొనర్చుచుండుదుఁ దనయా. ద్వి. 245

క. కావున మద్భక్తికి దప
మే విధమున మూలధనము నిది నీమది రా
జీవభవఁ యెఱిఁగిత ప మిటు
గావించుట విగతమోహకర్మృఁడ వింకన్. ద్వి. 246

భగవన్నామము భక్తితో జేసినను భయముతో జేసినను
ఫలమొక్కటి యగుట సిద్ధము.

ఆ. బాంధముననైనఁ బగనైన వగనైనఁ
బ్రీతినైనఁ బ్రాణభీతనయిన
భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు
జనులు మోక్షమునకుఁ జనుదురధిపా. ద. పూ. 73

క. దెంపంబు పుత్రువలనం
బెంపినదని తలఁపవలదు శ్రీపతిపేరే
చంపమునన్నైనఁ బలికిన
సంపదధరుఁ డంపఁగలఁడు నాథుండగుచున్. ష. 121

క. కామంబు పుణ్యమార్గ
స్థేమంబు మునీంద్రసాంద్రచేతస్సరసీ
ధామంబు విష్ణునిర్మల
నామంబుఁ దలంచువాఁడు నాథుఁడుఁగాఁడే. ష. 120

ఆ. బిడ్డపేరుపెట్టి పిలుచుటవిశ్రామ
కేలినైన మిగులగేలినయినఁ
బద్యగద్య గీతభావార్థములనైన
గమలనయనుఁ దలఁపఁ గలుషహరము. ష. 122

ఆ అలుకనైనఁ జెలిమినైనఁ గామంబున
నైన బాంధవముననైన భీతి
నైనఁ దగిలితలఁప నఖిలాత్ముఁడగుహరి
జేరవచ్చు వేఱుసేయఁ దతఁడు. స. 14

ప్ర—తనకుగల ఆస్తిని పంచి పెట్టుటెట్లు ?

ఉ.—సీ. ఇచ్చెదననిపల్కి యీకున్ననరకంబు
ద్రోయనీవును సమర్థుడవుగావ
యేదానమున నాశమే లెంచునదియును
దానంబుగావంప్ర తత్త్వవిదులు
దానంబు యజ్ఞంబు తపము కర్మంబును
దా విత్తవంతుడై తలపవలయు
దనయింటిగల సర్వధనముసు నైదుభా
గములుగా విభజించి కామమునకు

తే. నర్థమునకు ధర్మయశముల కాశ్రిత
బృందములకు సమతబెట్టునట్టి
పూజ్య డింపు నంపు పూర్ణుడై మోదించు
తన్నుమానిచేత తగవుగాదు. ఆ. 580

ప్ర—బ్రాహ్మణ ధర్మమేమి ?

ఉ.—క. ధరణీదివిజులు శ్రుతులును
నరవర యొక్కెటి ముఖమునం బొడముట భూ
సురుఁ డఖిలవర్ణములకుఁ
గురుఁడుఁ ముఖ్యుండు నయ్యె గుణరత్న నిధీ. తృ 216

సీ. వినుకర్షణాదిక వృత్తికంటెను మేలు
యాచింప నొల్లని యట్టి వృత్తి
ప్రాప్తంబుఁ గైకొని బ్రదుకుకంటెను లెస్స
యనుదినంబును ధాన్యమడిగికొనుట
యాయవారముకంటె నధిక కల్యాణంబుఁ
బఱగ యెన్నుల ధాన్యభక్షణంబు
శిలవృత్తికంటెను శ్రేయమాపణములఁ
బడ్డగింజలువెని బ్రదుకఁ గనుట
గీ. యెడనుచోట నృపతి కీనాల్గు వృత్తులు
దగుఁ బ్రతిగ్రహంబు వగదుఁ దలప
నాపదవసరముల నధముఁ డెక్కువజాతి
వృత్తినున్న దోషవిధముగాదు. స. 410

వ. వినుము శిలవృత్తియు, ఉంఛవృత్తియు, ఋతమనియు, నయాచితవృత్తి యమృతమనియు, నిత్యయాచ్ఞావృత్తి మృత మనియుఁ గర్షకవృత్తి ప్రమృతమనియు నెన్నుదు రట్టి వృత్తులలో జీవించుటమేలు వాణిజ్యంబు సత్యానృత మనియు శ్వవృత్తి నీచసేవయనియుఁ బలుకుదురు సర్వవేద మయుండు బ్రాహ్మణుఁడు సర్వదేవమయుఁడు క్షత్రియుఁడు, బ్రాహ్మణ క్షత్రియులకు, నీచసేవనంబు కర్తవ్యంబుగాదు.
స. 411

క. దమమును శౌచముఁ దపమును
శమమును మార్దవముఁ గృపయు సత్యజ్ఞాన
క్షమలును హరిభక్తియు హ
ర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా. స. 412

## క్ష త్రి యు లు

క. ధరబ్రాహ్మణాదికము ద
స్కరబాధలఁ బొందకుండఁ గైకొని కావం
బురుషోత్తము బాహువులన్
నరనాథకులంబు పుట్టె నయతత్త్వనిధీ తృ. 217

మ. శౌర్యము దానశీలముఁ బ్రసాదము నాత్మజయంబుఁ దేజ
మున్, ధైర్యము దేవభక్తియును ధర్మము నర్షముఁ గా
మమున్ బుధా, చార ముకుంద సేవలును సత్కృతియుం బరి
తోషణంబు స్వస్వర్యము దక్షణంబుఁ బృథివీవరశేఖర రాజ
చిహ్నముల్. స. 413

## వై శ్యు లు

క. గణుతింపఁగఁ గృషి గోర
క్షణ వాణిజ్యాదికర్మ కలితంబుగ నా
గుణనిధి యూరువు లందుం
బ్రణుతింపఁగ వైశ్యజాతి ప్రభవం బయ్యెన్. తృ. 218

క. ధర్మార్థకామ వాంఛయు
నిర్మలగురుదేవ విప్రనివహార్చనముల్
నిర్మదభావముఁ బ్రమదము
కర్మకరత్వమును వైశ్యజన లక్షణముల్. ష. 414

## శూద్రులు

తే. తివిరి సేవక ధర్ములై దేవదేవు
పదములను శూద్రసంతతు లుదయమైరి
వీరలందఱుఁ దమ తమవిహిత కర్మ
మలరఁ జేయుచు జనుచుండు నాత్మగురుఁడు. తృ. 218

ఉ. స్తేయములేని వృత్తియు శుచిత్వము సన్నుతియున్ నిజేశులన్
మాయలులేక డాయుటయు మంత్రము సెప్పక పంచయజ్ఞ
ముల్, సేయుటయున్ ధరామరుల సేవయు గోవులరక్ష
ణంబు న, న్యాయము లేమియున్ మనుజనాథ యెఱుంగుము
శూద్ర ధర్మముల్. స. 415

## సంకరజాతులు

వ. మఱియు సంకరజాతులయిన రజక చర్మకారక నట బురుడ కైవర్తక మేడ భిల్లు రగుసంత్యజాతు లేడ్వురకును జండాల పుల్కస మాతంగ జాతులకును నాయాకులానుగతంబైన వృత్తుల జౌర్యహింసాదులు వర్జించి సంచరింపవలయు మాన వులకుఁ బ్రతియుగంబున నైసర్గికంబులైన ధర్మంబులు రెండు లోకంబులందును సుఖకరంబులని వేదవిదులైన పెద్దలు సెప్పు దురు. కారు కారున దున్నెడు క్షేత్రంబు లావునెడు నందుఁ జల్లిన బీజంబులు నిస్తేజంబులై యుండి లెస్సగ నంకురింపవు, నిరంతర ఘృతధారావర్షంబున దహనంబునకు దాహకత్వంబు లేక శాంతిం జెందు నందువేల్చిన హవ్యంబులు ఫలింపవు తద్విధంబున ననవరత కామానుసంధానఁ గామోన్ముఖంబైన చిత్తంబు కామంబులందనిసి నిష్కామంబై విరక్తి నొందుం

గావున సత్వస్వభావంబుతోడ నెప్పుడు తప్పక నిజవంశాను గత విహితధర్మంబున వర్తించునదియందు మెల్లన స్వాభావిక కర్మ పరత్వంబు విడిచి ముక్తినొందు జాతిమాత్రంబునఁ బురుషునికి వర్ణంబు నిర్దేశింపంబనిలేదు. శమదమాది వర్ణలక్షణ వ్యవహారంబులఁ గనవలయునని మఱియు నారదుం డిట్లనియె.
స. 419

## బ్రహ్మచర్యాశ్రమము

వ. వినుము బ్రహ్మచారి మౌంజీ కౌపీన యజ్ఞోపవీత కృష్ణాజిన పలాశదండమండల ధరుండును సంస్కారహీనశిరోరుహుండును విన్యహస్తుండును శీల ప్రశస్తుండును మౌనియునై త్రిసంధ్యంబును గాయత్రి జపించుచు సాయంప్రాత రవసరంబుల నర్కపావకగురుదేవతోపాసనంబులు సేయుచు గురు మందిరంబునకుంజని దాసునిచందంబున భక్తివినయ సౌమనస్యంబులు గలిగివేదంబులు చదువుచు నధ్యయనోపక్రమావసానంబున గురుచరణంబులకు నమస్కరించుచు రేపుమాపు విహితగృహంబుల భిక్షించి భైక్షంబు గురువులకు నివేదించి, యనుజ్ఞగొని మితభోజనంబుగావించుచు విహితకాలంబుల నుపవసించుచు నంగనలయందు నంగనాసక్తులందు బ్రయోజన మాత్ర భాషణంబు లొనప్పుచు గురుపరాంగనలవలన నభ్యంగకేశ ప్రసాధన శరీరమర్దన మజ్జనపరిహాస్య యోగంబులు వర్జించుచు గృహంబున నుండక జితేంద్రియత్వంబున సత్యభాషణుండయి సంచరింపవలయు.
స. 421

ఆ. పొలఁతి దావవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు
కరఁగ కుండరాదు కదిసెనేని

బ్రహ్మాగ్నైనఁ గూతుఁ బట్టికమానఁడు
వడుగు కింతి పొత్తు వలదు వలదు. స. 422

## గృహస్థాశ్రమము

వ. వినుము స్వరూపసాక్షాత్కారంబున దేహి బహిరింద్రియాత్మి కంబయిన యింతియు నాభాసమాత్రంబుగా నిశ్చయించి యొంటాక జీవుండు స్వతంత్రుఁడయిన యీశ్వరుండు గాక యుండు నంతదడవు నంగన యిది పురుషుండనేననియొడిబుద్ధి మానుట కర్తవ్యంబుగాదు. బ్రహ్మచారి యతి గృహస్థులం దెవ్వఁడైనఁ జిత్తంబుపరిపక్వంబుగాక యద్వైతానుసంధా నంబు సేసిన మూఢుండవుంగావున రహస్యంబునఁ బుత్రికనైన డాయకుండ వలయు. స 423

చ. శిరమునమేన సంస్కృతులు సేయక చందనభూషణాద్యలం కరణము లెల్ల మానిఋతుకాలమునన్నిజభార్యఁబొందుచున్ దరుణులఁజూడఁబాఱక ధృతవ్రతుఁడై మధుమాంసవర్జియై గురుతరవృత్తితో మెలఁగుకోవిదుఁ డొక్కగృహస్థు భూవరా.
స. 424

వ. మఱియు ద్విజుండు గృహస్థుండై గురువులవలన నుపనిష దంగసహితంబైన వేదత్రయంబును పఠియించి నిజాధి కారానుసారంబుగా నర్థవిచారంబుసేసి తనబలంబుకొలంది గురువులకు నభీష్టంబులొసంగి గృహంబుననొండె వనంబున నొండె నైష్ఠికత్వంబు నాశ్రయించి, ప్రాణులతోడ జీవిం చుచు, గురువునందు, నగ్నియందు, నాత్మయందు, సర్వ భూతంబులయందు, నచ్యుతదర్శనంబు సేయుచు, నింద్రియ

వ్యసనాది మగ్నుండుగాక, యెఱుకగలిగి వర్తించుచు పర
బ్రహ్మంబునొందు. స. 425

## వానప్రస్థాశ్రమము

క. వినుము వనప్రస్థునకుఁ
మునికధితములైన నియమములు గల వాచో
ప్పున నవగతుఁడై మెలఁగెడి
ఘనుఁడు మహర్లోకమునకు గమనించున్నృపా. స. 426

వ. అటమీఁద గృహస్థాశ్రమంబువిడిచి వనంబునకుంజని, దున్నక
పండెడి నీవారాదికంబు లగ్నిపక్వంబుసేసియుండె, నామంబులు
సేసియుండె నర్కపక్వంబులైన ఫలాదులొండె భక్షించుచు,
వన్యాహారంబుల నిత్యకృత్యంబులయిన చరుపురోడాశంబు
లొనర్చుచుఁ బ్రతిదినంబును బూర్వసంచితంబులు బరిత్యజించి,
నూతనద్రవ్యంబులఁ సంగ్రహించుచు, నగ్నికొఱకుఁ బర్ణశాల
నైనఁ బర్వతకందరంబయిన, నాశ్రయించుచు హిమవాయు
వహ్ని వర్షాతపంబులకు సహించుచు నఖశ్మశ్రు తనూరు
హంబులు ప్రసాధితంబులుసేయక జటిలుండై వసియించుచు
దండాజినకమండలువల్కల పరిచ్ఛదంబులుధరియించి, పండ్రెం
డైన నెనిమిదైన నాలుగైన రెండైన నొకవత్సరంబయినఁ దప
ప్రయాసంబున బుద్ధినాశంబుగాకుండ మునియై సంచరించుచు
దైవవశంబున జరారోగంబులచేతఁజిక్కి నిజధర్మానుష్ఠాన
సమర్థుండు గానిసమయంబున నిరశనవ్రతుండయి యగ్నుల
నాత్మారోపణంబులుసేసి సన్యసింపవలయును. స. 427

క. అనఘ వనప్రస్థుండై
చని తద్ధర్మంబులిట్లు సలుపుచు మఱియుఁ

మనెనేని సన్యసింపం
జనునటమీఁదటను ముక్తసంగత్వమునన్. స. 423

## సన్యాసాశ్రమము

వ. ఇట్లు వానప్రస్థాశ్రమంబుజరపి సన్న్యసించి దేహమాత్రా
వశిష్టుండును, సర్వభూత నిరపేక్షుండును, భిక్షుండును, నిరా
శ్రయుండును, నాత్మారాముండును, సర్వభూతసముండును,
శాంతుండును, సమచిత్తుండును, నారాయణపరాయణుండును
నై కౌపీనంబును నాచ్ఛాదనమాత్రంబయినవస్త్రంబుధరించి,
దండాదివ్యతిరిక్తంబులు విసర్జించి, యాత్మపరంబులుగాని
శాస్త్రంబులువర్జించి, గ్రహనక్షత్రాదివిద్య లభ్యసింపక
యొందునుబక్షీకరింపక, శిష్యులకు గ్రంథంబులువచియించి
యుపన్యసింపక, బహువిద్యలజీవింపక మఠాదివ్యాపారంబుల
నుల్లసిల్లక, పెక్కుదినంబు లొక్కయెడ వసియింపక
యూరూర నొక్కొక్కరాత్రి నిలుచుచుఁ గార్యకారణ
వ్యతిరిక్తంబైన పరమాత్మయందు విశ్వంబు దర్శించుచు,
సదసన్మయంబైన విశ్వంబునందుఁ బరబ్రహ్మంబయిన యాత్మ
నవలోకించుచు, జాగరణ, స్వప్న సంధి సమయంబుల నాత్మ
నిరీక్షణంబుసేయుచు, నాత్మకు బంధమోక్షణంబులు మాయా
మాత్రంబులుగాని వస్తుప్రకారంబున లేవనియును, దేహంబు
నకు జీవితంబు ధృవంబుగాదనియును, మృత్యువు ధృవం
బనియును, నెఱుంగుచు, భూతదేహంబుల సంభవనాశంబు
లకు మూలంబయినకాలంబు ప్రతీక్షించుచు, నిర్వేదంబున
జ్ఞానోత్పత్తిపర్యంతంబుఁ జరియించి యటమీఁద విజ్ఞాన
విశేషంబు సంభవించినఁ బరమహంసుండై దండాది

చిహ్నంబులు ధరియించియుండె, ధరియింపకయుండె, బహిరంగవ్యక్త చిహ్నండుగాక, యంతరంగవ్యక్తంబైన, యాత్మానుసంధానంబుగలిగి, మనీషియై, బాహ్యానుసంధాన భావనంబు, మనుష్యులకుఁ దనవలన నున్మత్త, బాలమూకుల తెఱంగుఁ జూపుచుండవలయును. స. 429

ప్ర — ప్రహ్లాదుఁడుచెప్పిన వాని నెవరెవ రెట్లుపయోగించెదరు.

ఉ — వ మౌన, వ్రత, జప, తప శ్రుత్యాధ్యయనంబులును, నిజ ధర్మ, వ్యాఖ్యాన, విజనస్థల, నివాససమాధులును మోక్ష హేతువులగు నయిన నివి మఱియు, నింద్రియజయంబు లేని వారికి భోగార్థంబులయి విక్రమించువారికి జీవనోపాయంబు లయి డాంబికులకు వార్తాకరంబులై యుండు సఫలంబులు గావు, భక్తిలేక భవదీయజ్ఞానంబులేదు. స. 366

ప్ర — హీనకులుఁడు భగవన్నామముచేయవచ్చునా లేదా.

ఉ — క. కులహీనుఁడు నారాయణ
విలసత్కథనములుగడఁక వినిపించిన ద
త్కులహీనతఁబాసి మహో
జ్జ్వల కులజత్వమును బొందు సన్మునులారా. ప్ర. 450

క. ధీమహిత భవన్మంగళ
నామస్మరణాను కీర్తనముగల హీనుల్
శ్రీమంతులగుదు రగ్ని
ష్టోమాది కృతాళికంటె శుద్ధులు దలపన్. తృ. 1035

క. నీనామస్తుతి శ్వపచుం
డైనను జిహ్వాగ్రమందు ననుసంధింపన్

వానికి సరి భూసురుఁడుం
గానేరఁడు చిత్రమిది జగంబుల నరయన్. త్రృ. 1037

ప్ర.—సాధురక్షణ దుష్టశిక్షణ ఎట్టిది ?

ఉ.—క. రక్షణములేక సాధువు
రక్షితుఁడగు సమతఁజేసి రాయిఁడులందుర్
రక్షణములు వెయిగలిగిన
శిక్షితుఁ డగు ఖలుఁడు పాపచిత్తుం డగుటన్. ద. పూ. 277

ప్ర.—స్త్రీల చూపులెట్టివి ?

ఉ.—ఆ. కాముగెలువవచ్చుఁ గాలారిగా వచ్చు
మృత్యుజయము గలిగి మెఱయ వచ్చు
నాఁడు వారి చూపుటంపఱగెలువంగ
వశముగాదు త్రిపుర వైరికైన. అష్ట. 405

ప్ర.—సంసార వృక్షమెట్టిది?

ఉ.—సీ. ప్రకృతియొక్కటి పాదు ఫలములు సుఖదుఃఖ
ములు రెండు గుణములు మూఁడువేళ్లు
తగురసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు
లెఱుఁగెడి విధములై దింద్రియంబు
లాఱు స్వభావంబు లాశోకమోహాదు
లూర్ములు ధాతువు లొక్కయేడు
పైపార లెనిమిది ప్రంగలు భూతంబు
లైదు బుద్ధియు మనోహం కృతులును
గీ. రంధ్రములు దొమ్మిదియుఁ గోటరములు ప్రాణ
పత్త్రదశకంబు జీవేశ పక్షియుగముఁ

గలుగు సంసారవృక్షంబు గలుగఁజేయఁ
గావ నడఁగింప రాజవాక్కరుఁడవీవ. ద. పూ. 90

ప్ర.—సంసారమెట్టిది ?

ఉ.—సీ. నీకు వీఁడెవ్వఁడు నీవెవ్వనికిశోక
సంతాపమందెదు సార్వభౌమ
పుత్రమిత్రాదులు పూర్వజన్మంబున
నెవ్వనివారలో యెఱుఁగఁగలవె
మొదల నదీవేగమున నాడకాడకు
సికతంబు గూడుచుఁ జెదరుచుండు
నారీతిఁ బ్రాణుల కతికాలగతిచేతఁ
బుట్టుట చచ్చుట పొసఁగుచుండుఁ

తే. గాన భూతములకుఁ గలుగు భూతంబులు
మమతతోడ విష్ణుమాయఁ జేసి
దీనికడలనేల ధృతిఁదూలఁగా నేల
బుద్ధిఁ దలపవలదె భూత సృష్టి. ష. 455

తే. కర్మవశమున నెందు సుఖంబులేక
దేవతిర్యఙ్మనుష్యయోనులఁ దిరుగునాకు
వెలయ నే జన్మమందునో వీరుతల్లి
దండ్రులయినారు చెప్పవే తాపసేంద్ర. ష. 461

తే. బాంధవజ్ఞాతి సుతులును బగతురాత్మ
వరులుదాసీన మధ్యస్థ వర్గములును
సరవిఁ గనుచుండు రొక్కొక్కజన్మమునను
నెఱయఁ బ్రాణికి నొకవావి నిజము గలదే. ష. 462

తే. రత్నములు హేమములు ననురాగలీల
నలరునమ్మిక నీవల నావల నగు
భంగి నరులందు జీవుండు ప్రాప్తుఁడగుచు
నెలమిఁ దిరుగుచునుండుఁ దానెందుఁ జెడఁడు. ష. 463

క. సతులెవ్వరు సుతులెవ్వరు
పతులెవ్వరు మిత్రశత్రు బంధుప్రియ సం
గతులెవ్వరు సర్వాత్మకఁ
గతుఁడై గుణసాక్షియైన ఘనుఁ డొక్కనికిన్. ష. 465

మ. చెలియే మృత్యువు చుట్టమే యముఁడు సంసేవార్థులే కింకరుల్
శిలలంజేసెనె బ్రహ్మ నన్ను దృఢమే జీవంబు నోచెల్లరే
చలితంబౌట యెఱుంగ కీకపటసంసారంబు నిక్కంబుగా
దలఁచున్ మూఢుఁడు సత్యదానకరుణా ధర్మాదినిర్ముక్తుఁడై.
అ. 647

ఉ. అచ్చపుఁ జీఁకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణులైన వారికిన్
జెచ్చెరఁబుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గానలకు నేఁగిననైన హరిప్రబోధముల్. స. 181

సీ. చుట్టాలుదొంగలు సుతులు ఋణస్థులు
కాంతలు సంసారకారణములు
ధనము లస్థిరములు తనువు నతిచంచల
గార్ధ్యగులచ్యులు గడచుఁగాల
మాయువు సత్వరమైశ్వర్యమతి శీఘ్ర
మని కాదె తమతండ్రి నతికరించి

మాతాత సాధుసమ్మతుఁడుఁ బ్రహ్లాదుండు
నీపాదకమలంబు నియతిఁజేరె
తే. భద్రుఁడతనికి మృతిలేని బ్రతుకు గలిగె
వైరులైకాని తొల్లిమావారు గాన
రర్థివైవచ్చి నీవున్నడుగు లెల్ల
బద్మలోచన మాపుణ్యఫలముగాదే. అష్ట. 648

సీ. సంసార మిది బుద్ధి సాధ్యము గుణకర్మ
గణబద్ధ మజ్ఞానకారణంబు
కలవంటి దింతియకాని నిక్కముగాదు
సర్వార్థములు మనస్సంభవములు
స్వప్నజాగరములు సమములు గుణశూన్యుఁ
డగుపరమునికి గుణాశ్రయమున
భవవినాశంబులు పాటిల్లినట్లుండుఁ
బట్టిచూచినలేవు బాలులార
తే. కడఁగి త్రిగుణాత్మకములైన కర్మములకు
జనకమైవచ్చు నజ్ఞానసముదయములు
ఘనతరజ్ఞాన వహ్నిచేఁ గాల్చిపుచ్చి
కర్మవిరహితులై హరిగనుటమేలు స. 233

మ. జనకుండెవ్వఁడు జాతుఁడెవ్వఁడు జనిస్థానంబు లెచ్చోటు సం
జననంబెయ్యది మేనులేవిలఁది సంసారంబులే రూపముల్
వినుమాయింతయు విష్ణుమాయపలుకుల్ వేఱేమియుఁ లేదు
మోహనిబంధంబు నిదానమింతటికిఁ జాయావిన్నఁ బోనేటి
కిన్. అ. 475

ఉ. దారలయందు మిత్ర ధనధాన్యములందు ననేక భంగులం
గూరిమిసేయు మర్త్యుఁడతిఘోర వియోగజదుఃఖ మగ్నుఁడై
నేపుపక్కి చిక్కువడి నీతివివేక విహీనుఁడై మనో
భారముతో గపోతపతిభంగి నిజంబుగఁబోవు నష్టమై. ఏ. 96

ఉ. నీవు మృతుండ నౌదు నని యుంతి భయంబు మనంబులోపలన్
మానుము సంభవంబు గల మానవకోట్లకుఁ జావు నిత్యమౌ
గా౯ హరింపలంపు మిఁకగల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ పొందెదవు మాధవలోక నివాససౌఖ్యముల్.
ద్వా. 25

తే. పుత్రదార గృహక్షేత్ర భూరివిషయ
ఘన సుఖాసక్తుఁడగుచునే మనుజుఁడేని
వర్ధివరియించు వాఁడు భవాబ్ధిలోన
జెంది యెన్నాళ్లకును దరిఁజేర లేఁడు ద. ఊ. 228

ఆ. అల్పధనుఁడు విశ్రమస్థానములఁ దృప్తి
బొందకొరుల ధనముఁ బొందగోరి
యరిగి వానివలన నవమానములఁ బొంది
యధికమైన దుఃఖమావహించు. పం. 171

ఆ. అంతఁగొంద ముల్లనన్యోన్య విత్తాది
వినిమయమునఁ గడుఁ బ్రవృద్ధమైన
వైరములను బొందిపోరాట మొందు దు
రాత్మచింతలేక యనుదినంబు. పం. 172

సీ. సంసారమార్గ సంచారుఁడై యధిక ప్ర
యాసంబునఁ గూర్చు నర్థములను

విహరించుచునుగొంచ ఁజహలోక ఫలముల
గోరుచు మోక్షంబుగోరకంత
జెడిపోవుచుందు రెప్పుడుగానిఁ యంతకుఁ
గడపటి సోగంబుగానలేరు
మానవంతులు నసమాన శౌర్యులు
నగువారు మిక్కిలినైన వైరిబుద్ధి
తే. సాహవంబున మడయుదురంతగాని
మోక్షమార్గంబుగా నరుమాఘవృత్తి
ననుచు సంసారగహన విహారమెల్ల
దెలిపి క్రమ్మఱననియె ధాత్రీసురుండు. పం. 173

వ. మఱియుం గాలచక్రనియంత్రితుండైన చక్రాయుధుం గొల్వక, కాక, గృధ్ర బకసమానులైన పాషండులతోడి సఖ్యంబునం జేసి వారలచేత వంచితుండై బ్రాహ్మణకులంబునం జేసి శ్రౌత, స్మార్తకర్మానుష్ఠానపరుండై, విషయసుఖంబులందుఁ దగులువడి కాలంబు తుదినెఱుంగక వృక్షంబులంబోలె నైహికార్థంబులయందుఁ దృష్ణగలిగి మైథున నిమిత్తంబు సుతదారాదులయందు స్నేహంబుసేయుచుఁ బధికుండు మాతంగంబులయందు భయంబున దీర్ఘనిమ్నకూపంబునం బడిన తెఱంగున సంసారమృత్యు గజభయంబున గిరికందర ప్రాయంబయిన యజ్ఞానతిమిరంబునం బడుంగావున మాయ చేత సంసారమార్గంబైన రాజభావంబువిడిచి సర్వభూత మైత్రిగలిగి జితేంద్రియుండవై, జ్ఞానాసిచేత మార్గంబుకడ పలగనుమని పలికిన భూపాలుం డి ట్లనియె. పం. 174

ప్ర—శ్రీభగవన్నామము చేయవలసిన కాలమేది ?

ఉ—సీ. పరధన పరదార పరదూషణాదులఁ
బరవస్తు చింతదాఁ బరిహరించి
ముదిమిచే రోగము లుదయింప కటమున్న
తనువు చంచల తను దగులకుండ
బుద్ధిసంచలతచేఁ బొదలక యటమున్న
శ్లేష్మంబు గళమునఁ జేరకుండ
భక్తియుక్తులమది సన్నగిల్లకమున్న
భక్తిభావనచేతఁ బ్రాపుఁ డగుచు
దైత్యభంజను దివ్యపాదారవింద
భజన నిజభక్తిభావనఁ బ్రాజ్ఞుఁడగుచు
నవ్యయానందమును బొందు ననుదినంబు
నతఁడు కర్మవిముక్తుఁ డౌనసఘ చరిత. ప. 95

ప్ర.—పరోపకార ఫలితమేమి ?

ఉ.—క. పరహితముసేయు నెవ్వఁడు
పరమహితుండగును భూతపంచకమునకుం
బరహితమె పరమ ధర్మము
పరహితునకు నెదురులేదు పర్వేందుముఖీ. అష్ట. 235

ఆ. హరుడు గళమునందు హాలాహలముపెట్టి
గప్పగలిగి తోడవు కరణిపొప్పె
సాధురక్షణంబు సజ్జనులకునెన్న
భూషణంబుగాదె భూవరేంద్ర. అష్ట. 247

క. హరిహరి సిరియురముఁగల
హరిహరి హయుకొలకు దనుజు నడుగం జనియెన్
బరహిత రతమతి యుతులగు
దొరలకు నడుగుటయునొడలి తొడవగుఁ బుడమిన్. అష్ట. 26

ప్ర.—భర్తలెట్లుచేసినను భార్యలు సహించవలెను.

ఉ.—క. ఉల్లములు నొవ్వనాడిన
గల్లలుచేసినను నగినఁ గలఁచిననైనన్
వల్లభులుసేయు కృత్యము
వల్లభలకు నెగ్గుగాదు వల్లభమధిపా. దశ. పూ.

ప్ర.—బాలురను శిక్షించుటమేలా కాదా ?

క. లాలనమున బహుదోషము
లోలిం బ్రాపించుఁ దాడనోపాయములం
జాలగుణంబులు గలుగును
బాలురకునుఁ దాడనంబు పథ్యంబరయన్. ద. పూ. 366

ప్ర.—ఎవరెవరేయేరూపము

ఉ.—సీ. అరయనాచార్యుండు పరతత్వరూపంబు
దండ్రి దలంపఁగ ధాతరూపు
రూపింప భ్రాత మరుత్పతిరూపంబు
దెలియంగఁదల్లి భూదేవిరూపు
భగినికరుణరూపు భావంబు ధర్మస్వ
రూపంబు దాసర్థి రూపుమొదల

నభ్యాగతుఁడు మున్న యగ్ని దేవునిరూప
సర్వభూతములఁ గేశవునిరూపు

ఆ. గానఁదండ్రి వేగ కడునార్తులగు పితృ
జనులమైన మమ్ముఁజల్లఁజూచి
పరభయంబువాపి నిరుపమంబగు తపో
మహిమచేత మెఱసి మనుపవయ్య.



| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకావ్యము, మూలము ... | 0 | 4 |
| డిటో సటీక ... | 0 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు కాలికో ... | 2 | 0 |
| ఆనందరంగరాట్ఛందము ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో ... | 0 | 6 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, | | |
| 3 సంపుటములు ... | 15 | 0 |
| 7 సంపుటములు ... | 18 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనిమూర్వు ... | 6 | 0 |
| కవికంఠోక్తి ... | 0 | 4 |
| కవిగజాంకుశము ... | 0 | 4 |
| కవిజనాశ్రయము ... | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి ... | 1 | 4 |
| కవిరాజమనోరంజనము ... | 1 | 4 |
| కవిజనరంజనము ... | 0 | 12 |
| కళాపూర్ణోదయము ... | 4 | 0 |
| ,, లఘుటీకానుక్రమణికతో ... | 5 | 8 |
| కృష్ణదండకము ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము ... | 1 | 0 |
| కాశీఖండము, శ్రీనాథునిది ... | 3 | 8 |
| క్రీడాభిరామము, శ్రీవల్లభరాయకృతము ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 8 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము ... | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, ద్విపద (కృష్ణార్జునసంవాదము) గోపమంత్రిది | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | 1 | 0 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది ... | 0 | 12 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు ... | 0 | 4 |
| గణికాగుణప్రవర్తనతారావళి ... | 0 | 4 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము ... | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము ... | 1 | 12 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... | 1 | 8 |
| చెన్నపురీవిలాసము ... | 0 | 8 |
| చెన్నబసవపురాణము, అత్తలూరి పాపకవి ... | 1 | 8 |
| ఛందోదర్పణము (అనంతునిఛందస్సు) ... | 2 | 0 |
| జైమినీభారతము, పిల్లలమర్రి పినవీరభద్రకవి ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు ... | 0 | 4 |
| దశావతారచరిత్ర, ధరణిదేవుల రామయమంత్రి ... | 4 | 0 |
| దసరాపద్యములు ... | 0 | 3 |
| దేశింగురాజుకథ (జంగంకథ) ... | 0 | 8 |
| ధనాభిరామము, నూతనకవి సూరనకృతము ... | 0 | 12 |
| ధ్రువోపాఖ్యానము, సటీక (భాగవతములోనిది) ... | 0 | 12 |
| నరసభూపాలీయము, సటీక (కావ్యాలంకారసంగ్రహము) | 3 | 0 |
| నలోపాఖ్యానము, సటీక ... | 0 | 12 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్య ప్రణీతము ... | 2 | 4 |
| నాచికేతోపాఖ్యానము, మల్లికార్జునకవి ... | 1 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 2 | 8 |
| నిరంకుశోపాఖ్యానము ... | 0 | 12 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము ... | 0 | 12 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడది ... | 2 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372, 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.

# మెఱుపురవ్వలు

120

ఈనాటి నాగరకత మానవునకు మానవునకు మధ్యగల మనస్సామరస్యం
గాదు; పశువునకు మానవునకు మధ్యగల ప్రబల తారతమ్యం.
ఈ సుఖాభిరతి, యీభోగసామగ్రి, యీ స్వార్థ
పరత—ఇవన్నీ మానవుని ఒక ప్రజ్ఞావంతమైన
పశువుగా నిరూపిస్తాయి; ఆధ్యాత్మిక
స్ఫూర్తిగల మానవునిగా
సూచింపజాలవు.

యమ్. ఆర్. దాస్